15.12.1995 శుక్రవారం 12 పేజీలు సంపుటి:67 సంచిక:50 విడిప్రతి రూ. 2.00 లు Phone: 27354 Regd. No. HNL 18


# జమీన్‌రైతు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి




# మాగుంట హంతకులిద్దరు దొరికారు!

మాగుంట సుబ్బరామ రెడ్డి గారి దారుణ హత్యోదంతం పై పోలీసు దర్యాప్తు చాలా మంద కొడిగా సాగుతూంది. అందులోనూ విచారణ చాలా రహస్యంగా జరుగు తుండడంతో, పైకి ఏదీ తెలియడం లేదు. దర్యాప్తు బాధ్యతను సిబిసిఐడి విభాగం నుంచి తప్పించి, స్పెషల్ బ్రాంచికి మార్చినట్లు తెలుస్తూంది. నక్సలైట్ల ఆను పానాలు, వివిధ దళాలు, వ్యక్తుల వివరాల పై సిబిసిఐడికి అంతగా అవగాహన లేక పోవడం వల్ల ఈ నిర్ణయం తీసు కున్నారని వినికిడి. విచారణ ఆలస్యం కావడానికి ఈ మార్పు ఒక కారణమై వుండవచ్చు.

హత్య జరిగిన మరుసటి రోజు ముఖ్య మంత్రి స్వయంగా చేసిన ప్రకటన తప్ప ఇప్పటి వరకు ఏ పోలీసు అధికారి కూడా ఈ విషయమై ఎటువంటి పత్రికా ప్రకటనా చేయలేదు. పత్రికల వారితో మాట్లాడ డానికి దర్యాప్తు అధికారులు ఇష్ట పడడం లేదు. నక్సలైట్ల నుంచి కూడా రాయలసీమ డివిజన్ ఇచ్చిన వివరణే ఆఖరు; ప్రావిన్షియల్ కమిటీ స్థాయిలో కేంద్ర నాయకు లెవరూ ఈ హత్య పై తమ వాదాన్ని ప్రజలకు వినిపించ లేదు. జరిగిన సంఘటన చాలా దారుణ మైనది, తీవ్రమైనది, పలు రూపాల ప్రభావితం కల్గినది కావడంతో ఇటు పోలీసులు, అటు నక్సలైట్లు తగిన సమాచారాన్ని ప్రజలకు అందించి వుంటే అపోహలకు, పుకార్లకు ఆస్కారం వుండేది కాదు. వారివురూ పెదవి విప్పక పోవడం వల్ల ప్రజలు తమకు నచ్చిన వచ్చిన తీరులో మాట్లాడు కొంటున్నారు.

ఈ పదిహేను రోజుల వ్యవధిలో దర్యాప్తులో చెప్పుకో దగిన పురోగతి - ఇద్దరు కీలకమైన హంతకులను పట్టుకో గల్గడం. ఆ రోజు సుబ్బరామ రెడ్డి గారిని వాకేసి పట్టుకొని, తమ రివాల్వర్లతో కాల్చిన హంతకులు - సూర్యం, వెంకటేశ్వర్లు - శ్రీకాకుళంలో దొరికారు. గత శుక్ర వారమే వీరి అరెస్టు జరిగింది. వారి పోలిడి పోలీసుకు ఎట్లా అందిం దన్నది అనూహ్యం. ఎవరో సమాచారం అందించడం వల్లనే పోలీసులు శ్రీకాకుళంలో తలదాచు కున్న వారిని పట్టుకో గల్గారు. హత్య తర్వాత వీరు అంత దూరం ఎందుకు వెళ్లారు, ఎట్లా వెళ్ల గల్గారన్నది ప్రశ్న. నక్సలైట్ కేంద్ర నాయకులు హత్యకు సంబంధించిన వివరణ కోసం వీరిని అక్కడకు పిలిపించి వుంటారని చెప్తున్నారు.

## కిడ్నాప్ యత్నమనేది రుజువైంది; కాని కారణం మాత్రం వెల్లడి కాలేదు!

శ్రీకాకుళం నుంచి వీరిని గుంటూరుకు తెచ్చి, ఆస్పత్రిలో వున్న గణేశ్‌కు చూపించి, చిన్నపాటి ఐడెంటి ఫికేషన్ పెరేడ్ చేయించి, హైదరాబాదుకు తరలించారట. పట్టుబడిన సూర్యం, వెంకటేశ్వర్లు లిద్దరూ గుర్తింపు పొందిన నక్సలైట్లనవి; అయితే వారికి ఇంతటి ప్రాధాన్యత కలిగిన హింసా చర్యలలో పాలు పంచుకునే అనుభవం లేదని చెప్తున్నారు.

పోలీసులు వారి నుంచి ఏ సమాచారం రాబట్టింది తెలియదు; చాలా రహస్యంగా వుంచారు ఆ విషయాలను. ఆస్పత్రిలో చికిత్స పొందుతున్న గణేశ్ ఇప్పుడు బాగా కోలుకున్నాడు. ఈ హత్య కేసులో నిజాలు నిర్ధారణగా చెప్ప గల్గిన వాడు అతడు ఒక్కడే. పట్టు బడిన డ్రైవరు నక్సలైటా, కాదా అన్న విషయమూ పోలీసులు ఇంకా తేల్చి చెప్పలేదు. ఈ సంఘటనలో పాలు పంచుకున్న లేదా సంబంధం కల్గిన మరి ఇద్దరిని అరెస్టు చేసి వున్నారనీ తెలుస్తూంది. పోలీసులు తమంతట తాముగా తేల్చి చెప్పడం లేదు కాబట్టి, అన్నీ వూహలు, అంచనాలే!

ఈ అస్పష్టతే పలు ఆధారం లేని అనుమానాలకు దారి తీస్తూంది. ఇది రాజకీయ హత్య అనే అభిప్రాయాన్ని కొందరు పని గట్టుకొని ప్రచారం చేస్తున్నారు. నిజానికి నక్సలైట్లు ఒక సంఘటనలో తమ ప్రమేయాన్ని ప్రకటించిన తర్వాత దాని పై ఇతరత్రా అనుమానాలు, వాదనలు అనవసరం. చంప డానికి నక్సలైట్లెట్లా భయపడరో, చంపినట్లు చెప్పడానికీ వారు సందేహించరు. వారి పై ఎటువంటి ఒత్తిడిలూ పని చేయవన్నది వాస్తవం. తమ హింసను వారు ధైర్యంగా సమర్థించు కుంటారు; ఇతరుల ప్రయోజనం కోసం హింసకు పాల్పడడమూ జరగదు. అందు వల్ల దీన్ని నక్సల్స్ ఘాతుకంగానే పరిగణించాలి తప్ప, ఇతరత్రా సందేహాలు వ్యాప్తి చేయడం తొందర పాటు అవుతుంది. ఇంకెవరో చంపి వుంటే, లేదా చంపించి వుంటే నక్సలైట్ నాయకులు తామెందుకు ప్రకటన

కొరవ 7 పేజీలో

## కారులో మందులు దిండ్లు, పండ్లు!

మాగుంట సుబ్బరామ రెడ్డి గారి హత్య సమయంలో హంతకులు వదిలేసి వెళ్లిన కారు డిక్కీలో చాలా సామానులు లభించాయి. అడవిలో క్యాంప్ వేయడానికి అవసరమైన వస్తువు లన్నీ వాటిలో వున్నాయి. రెండు మూడు కిలో మీటర్లకు పైగా దూరం చూడ గల్గిన యాషికా కంపెనీ తయారీ పవర్ ఫుల్ బైనాక్యులర్లు, దుప్పట్లు, వారం పది రోజులకు సరిపడా పండ్లు, ఫలహారాలు, బిస్కట్లు, అడవులలో వాడకానికి పనికి వచ్చే మందులు, ఎకె 47 తుపాకి బుల్లెట్ల మ్యాగజైన్ తదితరాలను పోలీసులు స్వాధీనం చేసు కున్నారు. ఈ ఏర్పాట్లు చూస్తే, వారం పది రోజులైనా సరే అడవులలో సుబ్బరామ రెడ్డి గారిని బంధించి వుంచ డానికి వీరు సిద్ధ పడ్డారని పోలీసులు అభిప్రాయ పడుతున్నారు.

# లక్ష్మీపార్వతి సభలతో దద్దరిల్లుతున్న రాజకీయం!

అధికారం వూడబెరికి ఇంట్లో కూర్చుండ బెట్టినా శ్రీమతి లక్ష్మి పార్వతి తన ప్రతాపాన్ని ప్రదర్శించడం మానడం లేదు. పైపెచ్చు ఆమె రాజకీయ వాదులను అదర గొట్టేస్తున్నారు. హైదరాబాదు సభ తర్వాత ఈ వారంలో ఆమె మదన పల్లెలో జరిపించిన సభ తీరు చూస్తే చంద్రబాబుకు, ఆయనతో వున్న తెలుగు నాయకులకు గుండెలు అదిరి పోయాయి. ఆ సభకు జనం వేల సంఖ్యలో తరలి వచ్చారు; ఆమె ఆవేశ పూరిత ప్రసంగానికి ఈలలు, చప్పట్లతో ప్రతి స్పందించారు; ఎన్టీఆర్‌కు, ఆమెకు జేజేలు పలికారు. మదనపల్లి - చంద్రబాబు స్వంత జిల్లాలోని పట్టణం; పెద్దగా జన సాంద్రత కల్గినదీ కాదు; కానీ సభ మాత్రం బ్రహ్మాండంగా జరిగింది.

ఎన్టీఆర్‌ను పంపించి, పెద్ద వయస్సులో బలహీన తలకు గురి చేయడంతో పాటు; ఆయన అధికారాన్ని అడ్డం పెట్టుకొని పంటింటి పెత్తనాన్ని పార్టీపైన, ప్రభుత్వం పైన విస్తరింప జేసిన అవినీతి పరురాలిగా అవాంఛనీయ శక్తిగా ఎంత ప్రచారం సృష్టించి నప్పటికీ లక్ష్మిపార్వతిని జనం ఆదరించడం చంద్రబాబుకే కాదు - మరె రాజకీయ వాదికీ అంతు బట్టడం లేదు. ఎన్టీఆర్ వినాశనానికి కారకురాలిగా ఆమెను చీదరించు కుంటారని భావించే సమయంలో ఆమె జన నీరాజనా లందుకోవడం అంతు బట్టని వింత పరిస్థితే కదా?

## తాను ఇంటికి పరిమితమై తన భార్యను రథమెక్కించడంలో ఎన్టీఆర్ ఆంతర్యం ఏమై వుంటుంది?

1984లో వలె జనం ఆవేశం ప్రదర్శించక పోయినప్పటికీ ఎన్టీఆర్ పై చంద్రబాబు తిరుగు బాటును హర్షించ లేకున్నారన్న వాదనకు ఈ సభలు ఆస్కారం కల్పిస్తున్నాయి. తెలుగు దేశం నాయకుడిగా రామారావునే భావిస్తున్నారని, ఆయన ప్రతినిధిగా లక్ష్మి పార్వతిని గుర్తించి, ఆమె చెప్పేది వినడానికి వస్తున్నారని దీన్ని బట్టి అర్థమౌతూంది. అయితే రామారావు గారు తాను ఇంటికి పరిమితమై జనం ఎదుటకు లక్ష్మి పార్వతిని పంపించడం లోని ఆంతర్య మేమిటన్నది కారణం వెతక వలసిన ప్రశ్న. ఆమెను తన వారసురాలిగా జనానికి పరిచయం చేస్తున్నా డాయన. తన తెలుగు దేశం పార్టీలో తన తర్వాత స్థానం ఆమెదేనని జనం స్పష్టంగా తెల్సు కునేందుకే ఈ పర్యటనలు, సభలని చెప్తున్నారు. తన పెద్దల్లుడు దగ్గుపాటి వెంకటేశ్వర రావును అప్రధానుడ్ని చేసి, లక్ష్మి పార్వతిని నాయకురాలిగా పెంచడంలోని ఆంతర్యం అదే కావచ్చు.

రామారావు గారి అనారోగ్యం కూడా ఆమె సభలకు ఒక కారణమే. ఇది వరకటి వలె వూళ్లు తిరిగి, సభలు జరిపించి, జనంతో కలిసి పోవడానికి ఆయన ఆరోగ్యం సహక రించడం లేదు. ఆ లోపం బయట పడకుండా, ఇంటి పట్టునే వుండి, అప్పుడప్పుడు పత్రికా ప్రకటనలు మాత్రం చేస్తూ జనాన్ని

కొరవ 7 పేజీలో

# మద్రాసులో నకిలీ షేరు- జాగ్రత్త పడడం మంచిదండోయ్!

మద్రాసులో ఒక చిన్న షేర బ్రోకరు ఏకంగా [illegible] ఉద్యోగి కోటి రూపాయల విలువైన నకిలీ షేర్ సర్టిఫికెట్లు ప్రింట్ చేసి, దగా చేశాడు. మద్రాసు స్టాక్ ఎక్స్ఛేంజికి చెందిన ఒక మెయిన్ బ్రోకర్ దగ్గర అతడు అసిస్టెంటుగా పని చేసేవాడట. ఆ పరిచయంతో ఫైనాన్షియర్స్ దగ్గర పలుకుబడి ఏర్పడింది. దాన్ని వుపయోగ పెట్టుకొని ఐటిసి భద్రాచలం, డిసిడబ్ల్యు, కృష్ణ ప్లాస్టిక్ కంపెనీల షేర్లు అచ్చు వేయించి, ఫైనాన్షియర్ల దగ్గర తాకట్టు పెట్టి 25 లక్షల రూపాయలు తీసు కున్నాడు. అయితే వారు వాటిని కంపెనీకి పంపే సరికి నిజం బట్ట బయలైంది. అవి నకిలీ సర్టిఫికేట్లని తేలింది. ఫైనాన్షియర్లు పోలీసు రిపోర్టు చేసే సరికి అతడు దొరికి పోయాడు. ఈ నకిలీ కుంభ కోణం వెనుక హైదరాబాదుకు చెందిన ఒక సబ్ బ్రోకరు కూడా వున్నాడని విచారణలో తేలిందట. కాని అతడు పరారీ అయి పోయాడు.

షేర్ సర్టిఫికేట్ల విషయంలో జాగ్రత్తగా వుండ వలసిన అవసరం వచ్చేసింది.

## స్పెక్యులేటివ్ షేర్లు

మద్రాసు స్టాక్ ఎక్స్ఛేంజిలోనూ స్పెక్యులేటివ్ షేర్ల లావా దేవీలు విపరీతమై పోయాయి. హైదరాబాదు ఇది వరకే వీటికి మారు పేరుగా మారిందన్న సంగతి తెలిసిందే. మద్రాసూ అందుకు కేంద్ర స్థానమౌ తున్నది. బ్రోకర్లు తమ స్వప్రయోజనాల కోసం స్పెక్యులేషన్‌ను సృష్టిస్తున్నారు. మార్కెట్‌లో సాధారణ లావా దేవీలు తగ్గి పోవడంతో ఖాళీగా వుండకుండా ఇది ఒక ముఖ్య వ్యాపకంగా మార్చు కుంటున్నారు. వారి ఆఫీసు బాడుగలు, జీత భత్యాల ఖర్చులు జరిగి పోయేందుకు వారీ పని చేస్తున్నారు. దీనివల్ల బ్రోకర్లకు జరిగే లాభం కొంచమే కాని, చిన్న ఇన్వెస్టర్లకు జరిగే నష్టం మాత్రం అపారం.

ఫైనాన్స్ కంపెనీల షేర్లనే వీరు స్పెక్యులేషన్‌కు ఎంపిక చేస్తున్నారు. గత

### డాక్టర్ ఎ. దుర్గాప్రసాద్

పద్నాలుగు రోజులలో సైబర్ ఫైనాన్స్ షేర్ ధర రు 10 నుంచి రు 24 లకు పెరిగింది; జి.హెచ్. రహేజా ఫైనాన్స్ షేర్ ధర పది రోజులలోనే రు. 220 కు చేరింది; వైబ్రంట్ ఫైనాన్స్ షేర్ ధర రు. 23 లు పలుకు తున్నది.

ఇవన్నీ పై పై భ్రమలు సృష్టించే పెరుగుదల లనేది స్పష్టం. వీటి ఆకర్షణకు లోబడితే దీపపు వెలుగుకు ఆకర్షింప బడి, అందులో పడి మాడిపోయే పురుగుల వలె అన్యాయమై పోతారు ఇన్వెస్టర్లు.

ఈ షేర్ల జూదం ఇంత పబ్లిగ్గా జరుగుతున్నా సెబి చూస్తూ వూరు కోవడమే విచారించ దగిన విషయం. కొత్తగా లిస్ట్ అయిన కంపెనీల పై స్పాట్ డెలివరీ నిబంధన విధిస్తే ఈ జూదాన్ని ఆపవచ్చు. అయితే సెబి అధికారులు అంత సీరియస్‌గా ప్రతి స్పందించడం లేదు. జనం కళ్ల నీళ్లు తుడవ [illegible] జూదం బాగా జోరుగా జరిగే సమయంలో లావాదేవీలు సస్పెండ్ చెయ్యడం; ఆ తర్వాత ఏదో ఒక ధర నిర్ణయించి వదిలేయడం అలవాటై పోయింది. షేర్ బ్రోకర్లకు, సెబి అధికారులకు మధ్య లోపాయికారీ ఒప్పందాలు వుండ బట్టే ఇట్లా జరుగు తూందని ఒక అనుమానం. వీరి ఆటలకు చిన్న [illegible] బలై పోతున్నారు.

## ప్రైమరీ మార్కెట్ 30 శాతం తగ్గుదల

గత సంవత్సరంతో పోలిస్తే ఈ ఏడాది ప్రైమరీ పబ్లిక్ ఇష్యూల ద్వారా కంపెనీలు వసూలు చేసే నిధుల మొత్తం గణనీయంగా తగ్గి పోయింది. మొన్న ఏప్రెల్ నుంచి నవంబరు 30 తేది వరకు

కొరవ 10 పేజీలో



నయాగరా పేపర్ లిమిటెడ్ నిర్వాహక సోదర ద్వయముడు శ్రీ రామమోహన రెడ్డి, విజయశ్రీ; వీరి వివాహం 1 తేది నెల్లూరులో జరిగింది.

# ప్యూజో కారు షేరు ఖాయంగా కొనవచ్చు!

ప్యూజియెట్ కార్ల తయారీకి సంబంధించి డిసెంబరు 18 తేది పెద్ద పబ్లిక్ ఇష్యూ విడుదల కాబోతూంది. ఫియట్ కార్లు తయారు చేసే ప్రీమియర్ ఆటో మొబైల్స్ లిమిటెడ్, ఫ్రాన్సుకు చెందిన ప్యూజెయెట్ కంపెనీ సహ భాగస్వామ్యంతో ప్యూజియెట్ 309 మోడల్ కార్లను భారతీయ మార్కెట్ కోసం తయారు చేయ బోతున్నారు. పెట్రోలు, డీసెల్‌లతో నడిచే రెండు మోడల్లు మార్కెట్‌లోకి వస్తాయి. ఇంజన్ సామర్థ్యం 1360 సిసి. తొలి ఏడాదిలో 75 శాతం పరికరాలు ఫ్రాన్స్ నుంచి దిగుమతి అవుతాయి. తర్వాత క్రమ పద్ధతిలో దిగుమతులను 20 శాతానికి తగ్గించి, 80 శాతం భాగాలు ఇండియాలోనే తయారు చేస్తారు.

రు. 10 ల ముఖ విలువతో 57 కోట్లకు పబ్లిక్ ఇష్యూ; 15 శాతం వడ్డీతో 178 కోట్లకు పార్ట్లీ కన్వర్టిబుల్ డిబెంచర్లు విడుదల చేస్తున్నారు. దీర్ఘ

### కొత్త ఇష్యూలు

కాలం, అంటే కనీసం రెండు మూడు సంవత్సరాలు షేర్లను తిరిగి అమ్మకుండా అట్టే పెట్టుకొనే వాళ్లకు ఇది మంచి పెట్టుబడి. దరఖాస్తు చేస్తే అలాట్ మెంట్ కూడా సులభంగా జరుగు తుంది. ఎట్టి పరిస్థితులలో నష్టం రాదు.

కొరవ 10 పేజీలో



# టెలిఫోన్ల గోల్మాల్

టెలిఫోన్ సర్వీసులను ప్రైవేటీ కరణ చేయడంలో కేంద్ర కమ్యూని కేషన్ల మంత్రి శ్రీ సుఖ్‌రాం అవినీతికి, ఆశ్రిత పక్ష పాతానికి పాల్పడ్డారన్న ఆరోపణలు చాలా ఆందోళన కరమైనవి. దేశంలో సాధారణ టెలిఫోన్ సర్వీసులను ప్రైవేటు పరం చేయడానికి ఆ మధ్య టెండర్లు పిల్చారు. హిమాచల్ ఫ్యూచరిస్టిక్ కమ్యూని కేషన్స్ లిమిటెడ్ అనే సంస్థ అత్యధిక భాగం ప్రాంతాలలో టెలిఫోన్ల నిర్వహణకు అధిక ధరతో టెండరు వేసింది. పూరు, పేరు తెలియని ఈ కంపెనీ అన్ని ప్రాంతాలకు టెండరు వేయడమే ఒక విచిత్రమైతే, అందులో వారు పేర్కొన్న ధర మరీ ఆశ్చర్యకర మైనది. దాదాపు 85 వేల కోట్ల రూపాయలు చెల్లించ డానికి వారు సిద్ధ పడ్డారు. రిలయన్స్, బిర్లాల వంటి బడా భారతీయ కంపెనీలతో పాటు లక్షలాది కోట్ల రూపాయల వ్యాపారం చేసే ఎటి అండ్ టి వంటి అంత ర్జాతీయ సంస్థలూ వీరితో టెండరు విషయంలో పోటీ పడలేక పోయాయి. హిమాచల్ కంపెనీ ఆఫర్ చేసిన ధరకు, వీరి ధరకు కొన్ని ప్రాంతాల విషయంలో రెట్టింపు తేడా వుంది. ఇన్ని వేల కోట్ల రూపాయలను ఈ చిన్న కంపెనీ ఏ విధంగా సమకూర్చ గలదో, ఏ మౌలిక సదుపాయలతో వారు టెలిఫోన్లను నిర్వహించ గలరో టెండర్ల సమయంలోనే ఎవరికీ అర్థం కాలేదు. పైగా టాటాలు, బిర్లాలే తమ శక్తి చాలదన్న భయంతో ఏదో ఒక విదేశీ కంపెనీతో సహ భాగస్వామ్యం కుదుర్చు కుంటే, వీరు మాత్రం ఎవరి సహకారం లేకుండా స్వతంత్రంగా టెండరు వేశారు.

కానీ తీరా డిపాజిట్లు కట్టవలసి వచ్చేసరికి ఈ కంపెనీ చేతులు వెల్లకిల వేసింది. ఈ కంపెనీ అధినేతలు మంత్రి సుఖ్‌రాంకు సన్నిహితులు. ఇద్దరిదీ ఒకే రాష్ట్రం. వారిద్దరి మధ్య ఏ లావాదేవీ జరిగిందో, ఎంత డబ్బు చేతులు మారిందో తెలియదు కాని, మంత్రి గారు టెండర్లు తెరవడం ముగిసిన తర్వాత వారికను కూలంగా నిబంధనలు మార్పు చేశారు. పాడి గోవుల వంటి ఢిల్లీ, హర్యానా, యుపిలో కొంత భాగం వరకు తమ వద్ద వుంచుకొని; తతిమా సర్కిళ్లను వదలు కోవడానికి వారికి స్వేచ్ఛ కల్పించారు. ఇందువల్ల ఆ కంపెనీ అంతగా లాభసాటి కాని సర్కిళ్లలో టెలిఫోన్ల నిర్వహణను నిబంధనలకు విరుద్ధంగా వదిలించు కోగల్గింది. వారి ధరకు, వారి వెనుక ఇతరులు వేసిన ధరకు ఈ సర్కిళ్లలో తేడా ఇరవై వేల కోట్ల రూపాయలు. మంత్రి గారి నిర్ణయం వల్ల ప్రభుత్వ ఖజానాకు అంత మేరా నష్టం వాటిల్లినట్లే లెక్క. ఢిల్లీ, హర్యానా సర్కిళ్లను ఇచ్చినందు వల్ల ఆ కంపెనీ అధినేత లిప్పుడు విదేశీ కంపెనీలకు వాటిని అధిక లాభాలతో తమ పెట్టుబడి చిల్లి గవ్వ లేకుండా తిరిగి విక్రయించ గల్గుతున్నారు.

టెండరు నిబంధనల ప్రకారం ఎక్కువ ధర ఆఫర్ చేసిన సర్కిళ్లన్నిటిలో వీరు టెలిఫోన్లు నిర్వహించి తీరాలి. లేని పక్షంలో వారు కట్టిన డిపాజిట్లు రద్దుతో పాటు ఇతర అపరాధాలు చెల్లించాలి. మంత్రి గారి పుణ్యమా అని వారు ఆ శిక్ష తప్పించు కొని, కోట్లాది రూపాయలు ఆర్జించ గలిగారు. టెండర్లు పిల్చే దశలో ఒక రకమైన నిబంధనలు, కేటాయింపులు జరిపే సమయంలో మరొక రకమైన నిబంధనలు విధించి మంత్రి చాలా పెద్ద నేరం చేశారు. దీనికి ఆయన జాతికి వివరణ ఇవ్వడంతో పాటు, ప్రభుత్వ ధన దుర్వినియోగం నేరం క్రింద శిక్ష అనుభవించి తీరాలి.

కాని దురదృష్టవ శాత్తు అది జరగడం లేదు. తాను తప్పు చేయనే లేదని దబాయి స్తున్నాడాయన. ఎన్నికల సమయంలో ఇంత పెద్ద అవినీతిని అంగీ కరిస్తే ప్రజల ముందు ఇబ్బందులు ఎదురౌ తాయనే భయంతో కాబోలు ప్రధాని సైతం ఆయనను కాపాడ యత్నిస్తున్నారు. ఆర్థిక వ్యవస్థ సరళీ కరణ ద్వారా అవినీతి అంత రిస్తుందని అందరూ భావిస్తే, అది ఇట్లా అవధులు మీరి పోవడం దురదృష్ట కరం. విద్యుత్ ప్రాజెక్టుల విషయంలోనూ ఇదే జరుగు తూంది. ఎన్‌రాన్ వంటి ప్రాజెక్టులలో ప్రాజెక్ట్ వ్యయపు అంచనాలు, విద్యుత్ ఛార్జీలు అధికంగా చూపడం వల్ల దేశ ప్రజానీకం కొన్ని దశాబ్దాల పాటు వేల కోట్ల రూపాయల విలువైన ధనం కోల్పో వలసి వస్తుందని రుజువైంది. టెలిఫోన్ల విషయంలోనూ అటువంటి దోపిడీకి రంగం సిద్ధం చేశారు మంత్రి గారు.

జమీన్‌రైతు

అధికారంలో వుండే వారు, ఇన్ని వేల కోట్ల రూపాయల ప్రజాధన దుర్విని యోగం ఆరోపణ తమ పై వచ్చినప్పుడు తమంతట తాముగా పదవుల నుంచి తప్పుకొని, పార్లమెంటరీ దర్యాప్తుకు కాని, మరే విధమైన విచారణకు కాని సంసిద్ధత వ్యక్తం చేయడం కనీస నైతిక ధర్మం. దాన్ని పాటించ కుండా, తప్పును సమర్థించు కొనేందుకు పేలవమైన వాదనలు చేస్తూ, పదవుల చూరు పట్టుకొని వ్రేలాడడం నీచమైన పని. మంత్రి గారు తనంతట తాను ఇంటికి పోను ఇష్టపడ కుంటే, ప్రధాన మంత్రి ఆయన్ను సాగనంపి, ఆ పై విచారణ జరిపించడం న్యాయం. అది ఎంత త్వరగా జరిగితే, ప్రధానికి, కాంగ్రెస్ పార్టీకి అంత మేలు. అవినీతి పరులను రక్షించ జూస్తున్నాడన్న అపవాదును ప్రధాని ఎందుకు భరించాలి?

## జమీన్‌రైతు

14.12.1945
సం: 0-1-6 పేజీలు:8

### నెల్లూరులో కరువు

నెల్లూరు జిల్లాలో వర్షములు లేనందు వల్ల మెట్ట గ్రామాల్లో కరువు ఏర్పడే పరిస్థితులు కనబడు చున్నవి. కొన్ని చోట్ల రైతులు పైర్లను కోసి పశువులకు మేసు కొంటున్నారు. కొడవలి పూజ్యమైన ఈ గ్రామాలలో కొంత నష్టమును సర్కారు వారు, కో ఆపరేటివ్ బ్యాంకులు కలిసి భరించే పద్ధతిలో చౌక ధరలకు అత్యవసర భోజన పదార్థములకు అమ్మించ వలెను. పేదలకు మధ్య తరగతి వారికి కొనుగోలు శక్తిని కల్గించుటకై వడ్డీలేని అప్పులు, కూలి పనులు ఆ గ్రామాలలోనే ప్రభుత్వము ఏర్పరచ వలెను. నెల్లూరు తాలూకా మెట్ట గ్రామాలకు పారుదల వసతిని ఇయ్యగల ఏటి కాలువ పనిని కరువు పనిగా మద్రాసు ప్రభుత్వము వెంటనే ప్రారంభించ వలెను. ఈ కాలువ స్కీము 1939లో ఇంజనీర్ల వల్ల పూర్తి చేయబడి సిద్ధముగా వున్నది. 30 గ్రామాలు దీనివల్ల లాభపడ గలవు.

### నెల్లూరుముచ్చట్లు

జగన్నాథం విడ్కోలు

జగన్నాథం గారు జమీన్ రైతులో హృదయాన్ని వదలి, కాయాన్ని మాత్రం పశ్చిమ గోదావరి తణుక్కు మోసుకొని పోతున్నాడు. 'విజయా' దవ క్షేమాన వెళ్లి సౌఖ్యాన రావయ్యా!

వినోద ప్రదర్శనమూల

ఆదరం, అభిమానం వుంటే గుణం మరీ రాణిస్తుంది. మన రమణా రెడ్డి పార్టీ పుష్పం బాగా వికసించింది రాణించింది, పరిమ ళించింది. ఆదరాభి మానాలు లేక ఆ చెట్టు క్రిందనే రాలి వాడి నశిస్తున్నది. ఇదీ మన ఒ రి వ్యక్తిత్వం. "తన పుత్రుని విద్య పెంపు - తన పెరటి చెట్టు మందును మనసున వర్ణింప రెట్టి మనుజాలు' అన్నాడు సుమతి.

50 ఏళ్ళ క్రితం ఈ వారం

"బాల రసాలసాల నవ పల్లవ కోమల ఆర్తు కన్య" గా వుండాల నాట్యకళ. అది లేని వాడు జీవచ్ఛ వాలను కుర్చీల్లో తగ లెయ్యడ మౌతుంది. ఈ పార్టీ వారి నిన్నటి కార్యక్రమం కంటికి, మనస్సుకు ఆనందాన్నిచ్చినది. మేము అనుభవించిన ఆనంద మేమిటో చెప్పమంటే "ఆకు పై బిల్లమని వ్రాసి నాకినట్లుం" టుంది. "అనుభవ రసికో విజానాతి".

కొరవ10వ పేజీలో

# ఎమ్మెల్యేల తీరు సిగ్గుచేటు!

ఈనాడు టెలివిజన్ శాసన సభలోని హొరాటాలు చూపిస్తుండడం వల్ల ఎమ్మెల్యేల తీరు తెన్నులు ప్రత్యక్షంగా చూసే అవకాశం ప్రజలకు ఏర్పడింది. ఎమ్మెల్యేల ప్రవర్తనా తీరు చూస్తుంటే, నిముషానికి లక్షలాది రూపాయల లెక్కన ప్రజా ధనం ఈ సభ నిర్వహణకు ఖర్చు పెట్టడం దండగని పిస్తుంది. ప్రస్తుత సమావేశాల్లో ఎన్టీఆర్ వర్గం సభ్యుల ప్రవర్తన పరమ రోతగా వుంది. వీరిలో పలువురు ఎమ్మెల్యేలు విద్యావంతులు. వీరు ఈ విధంగా ప్రవర్తించడం సిగ్గు చేటైన విషయం. తమ ప్రవర్తనా తీరు వల్ల ప్రజాస్వామ్యం అపహాస్యం పాలయ్యే విషయాన్ని వీరు గమనించడం లేదు.

గుంపర్లపాడు -పి. హజరత్తయ్య

### ఇండియన్ గ్యాస్ వినియోగదార్ల ఇక్కట్లు

పౌరసరఫరాల శాఖ వారు టౌన్‌లో ఇటీవల ఇండియన్ గ్యాస్ సరఫరా చేపట్టారు. వీరి ఆఫీసు, గోడౌన్ వేదాయ పాళెంలో వున్నాయి. ఈ గోడౌన్ నుంచి వేదాయ పాళెం, పోస్టల్, స్టేటు బ్యాంకు కాలనీ మిగతా చుట్టు ప్రక్కల కాలనీలకు వారే గ్యాసును సప్లై చేస్తె వసతిగా వుంటుంది. కాని ఈ కాలనీల వాళ్లు పది కిలో మీటర్ల దూరంలో వున్న స్టోన్ హౌస్‌పేటలో శ్రీమతి పెళ్లకూరు అనసూయమ్మ సత్రం ప్రాంతం నుంచి సిలిండర్ తెచ్చుకోవాలి. వీరు డోరు డెలివరీ ఇవ్వడం లేదు. కష్టమర్లు పది కిలో మీటర్ల దూరం వెళ్లి సిలిండర్లు తెచ్చు కోవాల్సి వస్తున్నది. దీనివల్ల 40 రూపాయలు అదనంగా ఖర్చవుతూంది. వినియోగ దార్ల ప్రయోజనాన్ని దృష్టిలో వుంచుకొని సిలిండర్లను వేదాయ పాళెం గోడౌన్ నుంచి సరఫరా చేయించే ఏర్పాట్లు జిల్లా పౌర సంబంధాల అధికారి చేయాలి.

-ఒక బాధితుడు

## జనవాణి

### పోలియోవ్యాధిని మట్టుబెట్టండి

నాడు లక్షలాది మందిని పొట్టన బెట్టుకున్న మహమ్మారి మశూచిని గట్టి పట్టు బట్టి మట్టు బెట్టాం; మశూచి ఉనికిని తెల్పిన వారికి 1000 రూపాయలు బహుమానం ప్రకటిస్తూ ధీమాగా దేశ వ్యాప్తంగా ప్రకటనలు గుప్పిస్తున్నాం. కాని నేడు ప్రపంచంలో వున్న మొత్తం పోలియో రోగుల్లో 60 శాతం మంది మన దేశంలోనే వున్నారన్నది బాధాకరమైన వాస్తవం. అందమైన బంగారు బాల్యాన్ని అంగ వైకల్యంతో వికృతంగా మార్చి నిర్వీర్యం చేసే మహమ్మారి పోలియో భరతం పట్టడానికి భారత ప్రభుత్వం నిశ్చయించింది. ఇప్పటికే ప్రపంచంలో 145 దేశాల్లో పోలియో పూర్తిగా నిర్మూలించ బడింది. 146వ పోలియో రహిత దేశంగా మనం ప్రపంచ పటంలో నిలుద్దాం. 9 తేది నాడు ఒక డోసు పోలియో వ్యాక్సిన్ 4 ఏళ్ల లోపు పిల్లలందరికీ వేయించే కార్యక్రమం జిల్లాలో విజయ వంతంగా జరిగింది. జనవరి 20 తేది రెండో డోసు వేయించడంలోనూ మొదటి సారి శ్రద్ధను స్వచ్ఛంద సంస్థలు, రాజకీయ పార్టీలు, ప్రజా ప్రతినిధులు

కొరవ 10 పేజీలో

# అంత కీర్తి ఎవరికీ రాదు- అంతటి నాయకుడూ రాడు!

స్వర్గీయ మాగుంట సుబ్బరామ రెడ్డి సంతాప సభ వి.ఆర్. హైస్కూల్ గ్రౌండ్స్‌లో 12 తేది జరిగింది. మధ్యాహ్నం మూడు గంటలకు ఎండలో సభ ఏర్పాటు చేస్తే అందరినీ ఆశ్చర్య పరుస్తూ, స్వచ్ఛందంగా తరలి వచ్చిన జనంతో గ్రౌండ్ కిటకిట లాడిపోయింది. సాయంత్రం 7.30 గంటల వరకు సభ కొనసాగుతున్నా, జనం ఒక్కరు కూడా కదల కుండా సుబ్బరామ రెడ్డి పై తమకున్న అపరిమిత అభిమానం ప్రదర్శించారు. జన సంఖ్యకు పోటీగా వచ్చిన వివిధ పార్టీల నాయకులు, సినీ రంగ ప్రముఖులతో వేదిక కూడా కిటకిట లాడిపోయింది. సభా నిర్వాహక సమన్వయ కర్త మునిసిపల్ చైర్మన్ ఆనం వివేకానంద రెడ్డి కూర్చునేందుకు స్థలం లేక ఐదు గంటల పాటు నిలబడే వుండాల్సి వచ్చింది పాపం! మాజీ ముఖ్య మంత్రి నేదురుమల్లి జనార్దన రెడ్డి, సినీ దర్శకుడు దాసరి నారాయణ రావు, మంత్రి రమేష్ రెడ్డి, కలికి యానాది రెడ్డి, సినీ నిర్మాత ఎం.ఎస్. రెడ్డి మాట్లాడిన మాటలు హృదయాంత రాళాల్లోంచి జాలు వారినట్లని పించాయి. ఎమ్మెల్యేలు వై.ఎస్. రాజశేఖర రెడ్డి, వి. హనుమంత రావు వుపన్యాసాలు ఆలోచింప జేశాయి.

సభాధ్యక్షుడు ఉత్తర ప్రదేశ్ మాజీ గవర్నర్ డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి మాట్లాడుతూ - స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత జిల్లాలో మాగుంట సుబ్బరామ రెడ్డి సంపాదించినంత కీర్తి సంపదను మరే నాయకుడూ సంపాదించ లేదని. ఆయన వలె స్వంత సంపద వెద జల్లిన వాడూ లేడని అన్నారు. మాజీ ముఖ్యమంత్రి నేదురుమల్లి జనార్దన రెడ్డి తన ప్రమేయంతో రాజకీయాల్లోకి వచ్చిన సుబ్బరామ రెడ్డి తన కళ్ల ముందే ప్రాణాలు కోల్పోవడం తలచుకొన్నప్పుడు కళ్లు చెమరుస్తున్నాయని పట్టుదలే పెట్టుబడిగా విజయం సాధించే మనస్తత్వం సుబ్బరామ రెడ్డిలో అణువణువునా వుందని. ఘనత వహించిన కేంద్ర ఆర్థిక మంత్రి డాక్టర్ మన్‌మోహన్ సింగ్‌కే ఆర్థిక పరమైన సలహా యిచ్చే స్థాయికి ఆయన ఎదిగారని. రాజకీయ రంగంలో కొనసాగుతూనే వ్యాపార రంగంలో సంచలనాలు సృష్టించడం మాగుంట సుబ్బరామ రెడ్డికే చెల్లిందని ప్రశంసించారు. కేంద్ర హోం శాఖ సహాయ మంత్రి సయ్యద్ సిబ్టే రజ్వీ బ్యాలెట్ వల్ల రాజ్యం వస్తుంది తప్ప, బుల్లెట్ వల్ల రాదని నక్సలైట్లు

> **మాగుంట సంతాప సభ జనంతోనూ, నాయకులతోనూ కిటకిటలాడింది!**

గ్రహించాలని హితవు పలికారు.

సినీ దర్శకుడు దాసరి నారాయణ రావు తనదైన సినీఫక్కీలో మాట్లాడారు. సుబ్బరామ రెడ్డి కాంగ్రెస్ పార్టీ మనిషి అనుకోవడం పొరపాటు. ఆయన పార్టీ పేదల పార్టీ, మంచి వాళ్ల పార్టీ, మనస్సున్న వారి పార్టీ; అన్నా అంటే నేనున్నా నవే పార్టీ మనిషన్నారు. నక్సలైట్లకు కాల్చను మంచి మనిషి. మాగుంట సుబ్బరామ గొప్ప కనిపించాడా? నన్నడిగి వుంటే రాక్షసులైన రాజకీయ నాయకుల లిస్ట్ ఇచ్చి వుండేవాడిని. ఆ రోజుల్లో మంచిని బోధించిన క్రీస్తును శిలువ వేసి, మహమ్మద్ ప్రవక్తను రాళ్లతో కొట్టి చంపారు. నేటి రోజుల్లో దైవత్వాన్ని పుణికి పుచ్చుకొన్న సుబ్బరామ రెడ్డిని చంపి నక్సలైట్లు సమాజం ముందు ముష్కరులుగా మిగిలి పోయారు. ఆయన పేరుతో నెల్లూరులోఒక అత్యాధునిక యూనివర్సిటీని వేదిక పై వున్న నాయకులు కలసి కట్టుగా మాట్లాడు కొని నిర్మించి పెట్టాలన్నారు. మార్కెటింగ్ మంత్రి రమేష్ రెడ్డి మాట్లాడుతూ మంచి తనంలో తనను మించి పోతున్నాడనే అసూయతో భగవంతునికి కన్ను కుట్టి మాగుంట హత్యకు ప్రేరేపించినట్లు చెప్పారు. పేదలకు ఎన్నో వేల మంగళ సూత్రాలు దానం చేసిన ఆ మహాతల్లి పార్వతమ్మ తాళి తెంపను ఆ భగవంతునికి మనసెలా వచ్చిందని అసలు ఈ సంఘటనలో దేవుడు వున్నాడా... అని ప్రశ్న కూడా వుద్భవిస్తుందన్నారు. నెల్లూరు టౌన్‌లో ఏ నాయకుడు ఎదిగినా సుబ్బరామ రెడ్డి లేని లోటు పూడ్చలేరంటూ; ఆయన వల్లే తాను నేడు ఈ స్థితిలో ఉన్నట్లు చెప్పుకొన్నారు. సి.ఎల్.పి. నాయకుడు పి. జనార్దన రెడ్డి మాట్లాడుతూ పేద ప్రజలను ఆదు కొంటామని చెప్పే నక్సలైట్లు పేదలకు సహాయ కారిగా వుండే మాగుంటను ఎలా బలి తీసుకున్నారో, సమాజానికి వివరణ ఇవ్వాలన్నారు. కడప ఎంపి వై.ఎస్. రాజశేఖర రెడ్డి సుబ్బరామ రెడ్డిని అజాత శత్రువుగా అభివర్ణించారు. కోపం ఆయన ముఖాన ఏనాడూ తాము చూడలేదంటూ; మాచర్లలో సుందర రామరెడ్డి హత్య జరిగిన సమయంలో పోలీసులు సరిగా వ్యవహరించి వుంటే మాగుంట హత్య జరిగేది కాదన్నారు. రాజ్యసభ సభ్యుడు

కొరకు 10 పేజీలో



## స ఇ గు డు

* రాజీనామా శిక్ష అవుతుందా?
* మాగుంట పేరు నాలుగు కాలాలు నిల్చే మంచి పని ఏదైనా చేయండి!

లంచాలు మెక్కారని బయట పడినప్పుడల్లా అధికారంలో వుంటే మంత్రులు. ముఖ్య మంత్రులను రాజీనామా చేయమని గగ్గోలు పెట్టడం ప్రతి పక్షాలకు అలవాటు. ఇప్పటి కేంద్ర టెలిఫోన్ల మంత్రి సుఖరాం విషయంలోనూ అదే గదా చూస్తున్నాం. మనం? ఆయన మంత్రిత్వాన్ని వదలుకొనే వరకు, వూరుకునేది లేదని అగం చేసేస్తున్నారు. పార్లమెంట్ పై [illegible] పోతుందని [illegible] మాన్య ప్రధాన మంత్రి వర్యులు ఏకంగా సమావేశాలు రద్దు చేసి పారేసి, పార్లమెంట్ తలుపులు మూత వేయించి, ఇప్పుడేమి చేస్తారు మమ్మల్నని వెక్కిరించ బోతున్నారు.

సుఖరాం తిన్నారు, లేదా తన వారికి తిన్పించారు అని అనుమాన పడుతున్న డబ్బు విలువ ఎంతో తెలుసా- ఇరవై వేల కోట్లు! ఆ డబ్బు ప్రభుత్వం దగ్గరే వుండి, సరిగ్గా ఖర్చు పెడితే రెండేళ్లలో ఆంధ్రాలో కరెంట్ కరువనేది లేకుండా చేసి పారేయవచ్చు; దేశంలో మంచి నీటి కొరత కన్పడ కుండా మాయం చేయవచ్చు; రెండు కోట్ల మందికి ఇల్లు కట్టించ వచ్చు; తెలుగు గంగ, నాగార్జున సాగర్, శ్రీశైలం, జూరాల, శ్రీరాం నగర్, పోచంపాడు, గాలేరు నగిరా నగిరా ప్రాజెక్టులన్నిటినీ కలిపి [illegible] సాయిబాబా వలె ఒకే ఒక్క ఏడా[illegible]లో పూర్తి చేయవచ్చు. అంత డబ్బు, వూహించ రానంత డబ్బు ఒకే ఒక్క మంత్రి పుణ్యాన దుబారా అయి పోయిందంటే, కొందరి జేబుల్లోకి వెళ్లిందంటే, అది పార్లమెంట్ సమావేశాల వాయిదాతో కప్పబడి పోయేంత స్వల్ప నేరమా? అందుకు మంత్రి గారి రాజీనామా పరిష్కారమా?

గద్దెనెక్కి, కోట్లు కొల్లగొట్టి, అది బయట పడితే రాజీనామా పెట్టి ఇంటికి వెళ్లి పోతే చాలునన్నది భారతీయ సాంప్రదాయమై పోతున్నది. అందువల్లే మంత్రులంత దర్జాగా ప్రజా ఖజానా పై పంది కొక్కుల్లా వాలి, అందినంత

> **డోలేంద్ర**

బొక్కుతున్నారు; ప్రజలు మాత్రం తమ కడుపులు మాడ్చుకొని వారినే మళ్లీ ఓట్లేసి గెల్పిస్తున్నారు.

ఆకలి తీర్చుకోను పది రూపాయలు పిక్ పాకెట్ కొడితే వాణ్ని నడి వీధిలో పట్టుకొని కుంగా తన్నే మనం; ఏ బందిపోటో బస్సులాపి రెండు సవర్ల నగలు దోచుకుంటే భూమి బద్దలై

కొరకు 7 పేజీలో

## కరెంట్‌పోతే కలెక్టర్‌కి ఫోన్ చేయమని రమేష్‌రెడ్డి ఉచిత సలహా!

# ప్రజలు విరాళాలిచ్చి, శ్రమదానం చేస్తే ప్రభుత్వం పనులు చేస్తుందట!

ప్రజల వద్దకు పాలన కార్యక్రమం ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు 'మిథ్యాసృష్టి' అని రెండో నెలలోనే ప్రజలకు అర్థమై పోయింది. ఈ కార్యక్రమాన్ని ఈ నెలలో జరిపించాలా.. వద్దా.. అన్న మీమాంసతో పదిరోజులు ఆలస్యంగా ప్రారంభించారు. అధికారులు తమను గ్రామాల్లో ప్రజలు గత నెలలో ఇచ్చిన అర్జీల తాలూకు పనుల విషయమై ఎక్కడ నిలదీస్తారో నన్న భయంతోనే అధికారులు బయలు దేరి వెళ్లారు. తొలి విడతగా జరిగిన ఈ కార్యక్రమంలో 1,71,534 అర్జీలు రాగా వాటి పరిష్కారానికి 403 కోట్లు కేవలం కోటి రూపాయలు మాత్రమే మంజూరు చేసింది. దీన్ని స్పష్టంగా దేనికి ఖర్చు పెట్టాలో నిర్ణయించక పోవడం వల్ల ఇంత వరకు జిల్లాలో ఒక్క పని కూడా మొదలు కాలేదు.

పాలన కార్యక్రమంలో వచ్చిన అర్జీలలో 1233 పనులు చేసేందుకు 7.40 కోట్లు మంజూరైనట్లు ఇద్దరు మంత్రులు 10 తేది విలేకరులకు చెప్పారు. కాని ఈ నిధులలో గ్రామ పంచాయితీలకు సంబంధించి 5 కోట్లు వున్నాయి. వీటితో 811 పనులు చేయడానికి అంచనాలు రెడీ చేసారు. మండల ప్రజా పరిషత్తు నిధులు కోటి రూపాయలతో 308 పనులు. జిల్లా పరిషత్తుకు సంబంధించిన 1.40 కోట్లతో 114 పనులు చేపడతారట. పైన పేర్కొన్న మూడు సంస్థలు స్వపరిపాలన వ్యవస్థలో భాగాలు. వీటిలో ప్రతి యేడాది నిధులు ఖర్చు పెడతారు. మరి ప్రజల వద్దకు పాలన కార్యక్రమం తాలూకు పనులకు అదనంగా నిధులు మంజూరైన మాటలోని మర్మాలేమిటో మంత్రులకే ఎరుక. మంత్రులు ఈ

> **నెల్లూరు సంగతులు**

పథకానికి పలు మెలికలు పెట్టి పనుల విషయం మళ్లీ ప్రజల నెత్తి మీదకి తోసారు. ఆర్థిక పరమైన వనరులతో కూడిన పనులకు సంబంధించి 9,209 వినతి పత్రాలు వున్నాయని లెక్క కట్టారు. వీటి పరిష్కారానికి కోటి రూపాయలు ప్రజల వద్ద నుంచే విరాళాలు స్వీకరిస్తారట. కాని ఇది సాధ్యమా? ఈ కోటి, ముందు ప్రభుత్వం ఇచ్చిన కోటి రూపాయలతో ప్రజలు శ్రమదానం చేసేందుకు ముందుకొచ్చే గ్రామాల్లోని పనులకు మ్యాచింగ్ గ్రాంటు మంజూరు చేస్తారట. ముందుకు రాని గ్రామాల్లో ఒక పని కూడా జరగదని చెప్పకనే చెప్పారన్న మాట. జిల్లాలో వున్న గ్రామాల్లో తప్పకుండా ఏదో ఒక పని ఏదో రకంగా చేస్తామని మాత్రం మంత్రులు ఆశ పెడుతున్నారు. గ్రామ సభల్లో బోగస్ కార్డులను గుర్తించి కొత్త కార్డు లిస్తారట. పాత కార్డులన్నీ పెరికినా కొత్తగా అర్జీ లిచ్చిన వారికి చాలవన్న విషయం అమాత్యులు మరచినట్లున్నారు పాపం! స్థానిక సంస్థల్లోని నిధులతో పనులు జల్సాగా జనవరి 1 నుంచి మొదలు పెడతారట. మిగిలిన ప్రజావసరాల పనుల్ని బడ్జెట్‌లో ప్రొవిజన్ పెట్టి పూర్తి చేయనున్నారట. కరెంటు పోతే కలెక్టరుకు ఫోను చేయమని మంత్రులు తప్పించు కొన్నారు. కలెక్టరేట్‌లో సామాన్యుల ఫోన్లకు కలెక్టర్ గుమాస్తా కూడా సమాధానం చెప్పరన్నది జగమెరిగిన సత్యం. ఏది ఏమైనా అధికారుల అంకెల గారడీ, పాలకుల తీపి వాగ్దానాలకు పరిమితమైన ప్రజల వద్దకు పాలన కార్యక్రమానికి ముచ్చటగా మూడవ నెలలో ముగింపు పలకక తప్పదేమో!

### కిరణశ్రీకి సన్మానం

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం ఈ సంవత్సరం కొత్తగా ప్రచురించిన ఏడవ తరగతి తెలుగు ఉపవాచకం 'ఆణి

కొరకు 11 పేజీలో

# బిల్లు కట్టకున్నా నాయకులకు కరెంట్ కట్ చేయను భయం!

లక్షలాది రూపాయల బిల్లులు బాకీ వున్న నాయకుల జోలికి పోను విద్యుత్ శాఖాధి కారులు జంకు తుంటారు. కాని సామాన్యుడు ఒక నెల బిల్లు చెల్లించక పోతే అతనికి షాక్ ట్రీట్‌మెంట్ ఇస్తారు. ముందు కనెక్షన కట్ చేసి పారేస్తారు; భారీ ఫైన్‌తో వసూలు చేస్తారు. ఆత్మకూరులోని ఒక ప్రముఖ రాజకీయ నాయకుని నుంచి లక్ష 25 వేల రూపాయల మేర విద్యుత్ బకాయి రావాల్సి వుంది. కాని ఈ బిల్లు [illegible] మొత్తం అడిగే ధైర్యం [illegible] రికో సంస్థలో పనిచేసే ఏ

## ఆత్మకూరు విద్యుత్ విచిత్రం

అధికారికి లేదట. దీనితో ఏళ్ల తరబడి ఆయన బిల్లు కట్టకుండానే విద్యుత్ వాడు కొంటున్నారు. గతంలో ఈ నాయకునికి 40 వేల రూపాయల మేర విద్యుత్ ఛార్జీలను రికో అధికారులు ప్రత్యేక కారణాలు చూపిస్తూ తోసేసారట. ఆత్మకూరు టౌన్‌లో కె.కె.ఆర్. ఆసుపత్రి నిర్వాహకులు 75 వేలు బిల్లు చెల్లించాల్సి వుండగా రికో ఎండితో వారికున్న ప్రత్యేక సంబంధాల వల్ల కరెంట్ కట్ కాకుండా కొనసాగి పోతున్నది. విద్యుత్ బోర్డు నష్టాల్లో వుందని చెప్పే అధికారులు బిల్లులు వసూలు చేయడంలో మాత్రం నిర్లక్ష్యం, పక్షపాతం చూపిస్తున్నారు. ఈ నెల బిల్లులలో జిల్లా వ్యాప్తంగా ప్రత్యేకంగా కరెంట్ ఛార్జీలతో పాటు, కస్టమర్‌ఛార్జీల పేరుతో అదనంగా 20 రూపాయల లెక్కన వసూలు చేసి తెలివిగా కొన్ని కోట్ల రూపాయలు ప్రజల వద్ద నుండి దోచు కోవడం పట్ల సర్వత్రా విమర్శ వినవస్తోంది.

### శాస్త్రీయ సంగీతాన్ని ఆదరించండి: బాలు

నేటి యువతీ యువకులు శాస్త్రీయ సంగీతాన్ని నేర్చు కోవడంతో పాటు, దాన్ని ఆదరించాల్సిన అవసరం ఎంతైనా వుందని చలన చిత్ర నేపథ్య గాయకుడు ఎస్పీ బాల సుబ్రహ్మణ్యం ఉద్బోధించారు. గూడూరులోని కాళిదాస కళానికేతన్ 36వ వార్షికోత్సవ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా విచ్చేసి మాట్లాడారు. కళాకారులు విద్యార్థి దశ నుండి సంగీతాన్ని అధ్యయనం చేయాలి; వీనుల విందుగా ఆలపిస్తూ, శ్రావ్యంగా లయ బద్ధంగా గానం చేయాలని సూచించా రాయన. పాశ్చాత్య సంగీత వరవడిలో పడి మాతృ సంగీతమైన శాస్త్రీయాన్ని చులకన చేయడం సబబు కాదన్నారు. టి. సుబ్బరామ రెడ్డి గారి సహాయంతో గూడూరు కాళిదాస కళానికేతన నిర్మించిన భవనానికి అమర గాయకుడు ఘంటసాల పేరు పెట్టాలని సూచించారు. రాష్ట్ర సెకండరీ విద్యా శాఖ మంత్రి బల్లి దుర్గా ప్రసాద్ మాట్లాడుతూ ఏళ్ల తరబడి స్వచ్ఛంధ సేవ చేస్తున్న సంస్థలకు ప్రభుత్వ సహాయం అందించేలా కృషి చేస్తానన్నారు. రాపూరు శాసన సభ్యుడు ఎల్లసిరి శ్రీనివాసులు రెడ్డి మాట్లాడుతూ చిత్ర సీమకు మంచి గాయకుడు ఎస్పీ బాల సుబ్రహ్మణ్యంను పరిచయం చేసిన ఘనత గూడూరులోని సంస్థకు వుండడం గొప్ప విషయ మన్నారు. సభకు డాక్టర్ సి.ఆర్. రెడ్డి అధ్యక్షత వహించారు.

## జిల్లా వార్తలు

ఉత్రా దుర్గా ప్రసాద్‌ను సంస్థ నిర్వాహకుడు షేక్ గౌస్ బాషా, ఎల్లసిరి శ్రీనివాసులు రెడ్డిని ఎస్పీ బాల సుబ్రహ్మణ్యం సన్మానించారు. వర్తమాన సినీ నటి కుమారి ఉజ్వల, సినీ పాత్రికేయుడు వ్యాస్ చంద్ ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. పాటల పోటీల్లో రాష్ట్ర వ్యాప్తంగా 80 మంది కళాకారులు పాల్గొన్నారు. కడప జిల్లాకు చెందిన కృష్ణారెడ్డి, నెల్లూరుకు చెందిన రేబాల దివిజ సినీ పాటల్లోను; డి. మురళీ కృష్ణకు లలిత సంగీతం, శ్రీహరికోటకు చెందిన స.హెచ్.

కొరవ 8 పేజీలో

# పాత సర్పంచ్‌లకే కొత్త చెక్‌బుక్‌లు- వెంకటాచలంఅన్యాయం!

పాత పరిచయాలు, చెక్కులకు సర్పంచులు ఇచ్చే మామూళ్లు డివిజన్ పంచాయితీ విస్తరణాధికారి మర్చి పోలేక పోతున్నారు. కొత్తగా ఎన్నికైన వెంకటా చలం మండలంలోని సర్పంచులను పట్టించుకోకుండా, పాత తేదీలు వేసి లోకగార్ నిధుల ఖాతాకు చెక్కులను మాజీ సర్పంచులకే ఇస్తున్నారట. విషయం అడుగుదామంటే ఏ రోజూ మండల కార్యాలయానికి ఆ మహాను భావుడు రాదట. ఎమ్మార్ఓ ఈ విషయం తనకు తెలియదని సమాధానం చెబుతున్నట్లు సర్పంచుల ఆవేదన. ప్రభుత్వం తమకు చెక్ పవర్ ఇచ్చిందని పత్రికల్లో ప్రకటించడమే గాని, చెక్ బుక్కుల ముఖం చూసి ఎరుగమని ఈ సర్పంచులు వాపోతున్నారు. ఆర్డీవో శ్రీదేవి గారూ ఈ సర్పంచుల గోడు పరిశీలించండి మేడమ్!

### వాశిలి పినాకినీ బ్యాంక్‌కు నూతన భవనం

వాశిలి పినాకినీ గ్రామీణ బ్యాంకును విశాల మైన నూతన భవనంలోకి 12 తేది మార్చారు. బ్యాంక్ ఛైర్మన్ ఎన్. మోహన కృష్ణ రిబ్బన్ కత్తిరించి తన చేతుల మీదుగా ఈ పని కావించారు. తర్వాత బ్యాంకు జనరల్ మేనేజరు వై. శివ శంకర్ అధ్యక్షతన సభ జరిగింది. బ్రాంచి మేనేజరు శ్రీహరి నాయుడు స్వాగతించి బ్యాంక్ రిపోర్టు చదివారు. 84లో అప్పటి జిల్లా కలెక్టర్ కుమారి కె. సుజాతా రావు చేతుల మీదుగా 35 వేల రూపాయల డిపాజిట్టుతో ప్రారంభమైన బ్యాంక్ ప్రస్తుతం 30 లక్షల మేర వ్యాపారం చేస్తున్నట్లు వివరించారు. వాశిలి పాల ఉత్పత్తి దారుల సంఘం అధ్యక్షుడు గంగా శ్రీనివాసులు నాయుడు బ్యాంక్ నిర్వహణలోని లోపాలను ఎత్తి చూపారు. ఛైర్మన్ మోహన కృష్ణ, జనరల్ మేనేజర్ వై.జి. శంకర్ తమ సమాధానాలతో ఖాతాదారులను సంతృప్తి పరిచారు. క్యాషియర్ శాస్త్రి చివరన వందన సమర్పణ చేశారు.

### కావలి నాగూర్‌వలి దర్గా కమిటీ

కావలి టౌన్ ఉత్తరం పేటలోని హజరత్ నాగూర్ వలి దర్గా కమిటీ ఎన్నిక 26 తేది జరిగింది. కమిటీ అధ్యక్షునిగా షేక్ అబ్దుల్లా, ఉపాధ్యక్షునిగా షేక్ రఫీ, ఎన్నికయ్యారు.

# నెల్లూరు ముచ్చట్లు

విమర్శకుడు

## ప్రధానమంత్రి పరామర్శ

మాగుంట సుబ్బరామ రెడ్డి గారి వియోగంతో విషాదంలో మునిగి వున్న సోదరు లిద్దరినీ, శ్రీమతి పార్వతమ్మను పరామర్శించ డానికి ప్రధాన మంత్రి శ్రీ పి.వి. నరసింహా రావు రేపు 18 తేది మద్రాసుకు వస్తున్నారు. సెక్యూరిటీ సమస్యల మూలంగా నెల్లూరుకు రావడానికి ఇబ్బంది వుండడంతో, మద్రాసుకు వచ్చి పరామర్శించ డానికి నిర్ణయించు కున్నారాయన.

## పోలీసు దర్యాప్తు కోరుతూ దీక్షలు

మాగుంట సుబ్బరామ రెడ్డి గారి దారుణ హత్యోదంతం వెనుక రాజకీయ పరమైన కుట్ర వున్నదని, దాన్ని వెలుగులోకి తెచ్చే రీతిలో దర్యాప్తు జరపాలని డిమాండ్ చేస్తూ రేపటి నుంచి వారం రోజుల పాటు వార్డు స్థాయిలో రిలే నిరాహార దీక్షలు చేయాలని ... కాంగ్రెస్ అధ్యక్షుడు ప్రవీణ్ కుమార్ రెడ్డి నిర్ణయించారు. మాగుంట అనుచరు లందరూ ఇందులో పాల్గొంటున్నారు. వారం పది రోజులలోగా పోలీసు నుంచి సరైన ప్రతిస్పందన లేకుంటే ఆమరణ దీక్ష చేస్తా నంటున్నారు ప్రవీణ్ కుమార్ రెడ్డి.

## జానకిరాం దుడుకుతనం

మాగుంట సుబ్బరామ రెడ్డి గారి హత్య వెనుక రాజకీయ కుట్ర వుందని, వారిని బయట పెట్టకుంటే పార్వతమ్మ గారిని ముందు పెట్టుకొని తాను ఆందోళన చేస్తానని మాజీ మంత్రి శ్రీ మాదాల జానకి రాం ఒక ప్రకటన చేశారు.

జానకి రాం ఆలోచనలు ఉదయగిరి రాజకీయాల చుట్టూ గిరికీలు తిరుగు తుంటాయి. మాజీ ఎమ్మెల్యే మేకపాటి రాజమోహన రెడ్డితో ఆయనకు రాజకీయ శతృత్వం వుంది. ఆ కక్షను తీర్చు కోవడానికి ఈ హత్యను సాధనంగా వాడుకో దల్చినట్లున్నా రాయన. ఒంగోలులో దొరికిన కారు డ్రైవరు ప్రకాశం రాజమోహన రెడ్డికి సన్నిహితుడని, అందువల్ల ఈ హత్యలో ఆయన ప్రమేయం వుందేమో విచారించాలని జానకి రాం ప్రచారం.

పూర్తిగా దురుద్దేశ్య పూరితమైన ప్రచారాలివి. ఎటువంటి ఆధారాలు, సమాచారాలు లేకుండా ఒక వ్యక్తి పై, ఆతరు మనకెంత శత్రువైనా కానీ, అంతంత పెద్ద నిందలు వేయడం ఎంత నీచపు రాజకీయం? ఎందుకింత దిగజారి ...న్నారు నాయకులు?

సుబ్బరామ రెడ్డి గారి హత్య విషయంలో అన్ని కోణాల్లో ... దర్యాప్తు జరపడం అవసరం. ఇందులో రెండు అభిప్రాయాలు లేవు. ప్రొఫెషనల్ స్థాయిలో ...ంది నిపుణత చాలదు కాబట్టి, ఈ కేసు విచారణకు సిబిఐకి అప్పగించడమూ అవసరం. రాజకీయ ప్రమేయ... ఇందులో వుంది వుంటే దాన్ని నిర్భయంగా వెలికి తీయాలి అందుకు నిజంగా ఎవరైనా పాల్పడి వుంటే కఠినాతి కఠినంగా శిక్షించి తీరాలి. రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు రెండింటి పైనా ఈ విషయంలో ఒత్తిడి తేవడం అందరి బాధ్యత.

అయితే ఆ విచారణ తేలేలోగా అనవసరంగా తమ రాజకీయ శత్రువుల పేర్లు వీధిలోకి లాగి, దుష్ప్రచారం చేసి, ప్రజల మనసులను విష పూరితం చేయ జూడడం క్షమార్హం కాని నేరం. జానకిరాం వంటి వారు కొంత ... పాటించడం మంచిది.

## కర్మక్రతువులలో జన నీరాజనం

సుబ్బరామరెడ్డి గారి కర్మక్రతువులు 11, 12, 13 తేదులలో జన సమ్మర్దంగా జరిగాయి. వందలు, వేల సంఖ్యలో జనం ... వరద ప్రవాహం వలె తరలి వచ్చి ఆయన స్మృతికి అంతిమ నీరాజనం సమర్పించారు. కొన్ని వేల మందికి భోజన ఏర్పాట్లు జరిగాయి

## చెరకు క్రషింగ్

నెల్లూరు చక్కెర ఫ్యాక్టరీలో చెరకు క్రషింగ్ 17 తేది నుంచి ప్రారంభ మౌతుంది. అందుకు తగిన ఏర్పాట్లన్నీ జరిగాయని ఎండి శ్రీ వీరభద్ర రావు తెలియ జేస్తున్నారు.

## అవ్వ, మనుమరాలు సజీవ దహనం

నెల్లూరు తూర్పు శివార్లలోని రాయపు హరిజన వాడలో 13 తేది వేకువ ఝామున ఒకే కుటుంబానికి చెందిన అవ్వ, మనుమరాలు సజీవ దహన మైనారు.

ఇంగిలాల కొండయ్య అనే హరిజనుడి పూరింటికి అర్థరాత్రి వున్నట్టుండి నిప్పు అంటు కున్నదట. పొయ్యి ఆర్పడంలో పొరపాటు జరగడంతో, నిప్పు రాజుకొని, రాజుకొని రవ్వలు లేచి, తాటాకు అంటు కున్నట్లుంది. అందరూ ఆద మరచి నిద్రించే సమయం; మంట వేడి వంటికి తగిలిన దాకా ఎవరికీ మెలుకువ రాలేదు. ఇల్లు పూర్తిగా మండి పోయే సమయంలో ఉలిక్కి పడి నిద్ర లేచారట. ఇంట్లో వున్న ఐదుగురు కుటుంబ సభ్యులు బయటకు పరుగెత్తారు. వయో భారం వల్ల అవ్వ ... అనే వృద్ధురాలు ఇంట్లోనే ... బడి పోయిందట. ఆమెను ... అనే ...పాప ... ఇంతలో హఠాత్తుగా కప్పు కూలి పడడంతో వీరిద్దరూ లోపలి చిక్కుబడి పోయి, సజీవ దహనమై పోయారు. అవ్వను కాపాడ బోయి ఆ పసికందు ప్రాణాలు కోల్పోయింది పాపం!

## సణుగుడు

7. పెజి కొరవ

తప్పును నిర్ధారించినట్లు, శిక్ష పడినట్లు, రికవరీ చేసినట్లు విన్నామా? చదివామా? తొక్కడానికి స్వంత సైకిల్ కూడా లేకుండా రాజకీయాలలోకి వచ్చి, పదవి రాగానే విలాస వంతమైన జీవితాలను అనుభవిస్తున్న నాయకులు ప్రతి టౌన్‌లో, జిల్లాలో, రాష్ట్రంలో వున్నారు. చిల్లి చిండబ్బు ఆదాయ వనరు వారికి లేదని, ఏ వ్యాపారమూ చేయడం లేదని తెలిసి కూడా వారంతంటి భోగలాల సతను అనుభవిస్తుంటే ఈ డబ్బు ఎక్కడిదని ప్రశ్నించే సాహసం మనలో ఒక్కరికైనా వుందా? ఆ సొమ్మంతా మనం పన్నులు కట్టినదేనని, మనకు చెందాల్సిన దేనని తెలిసీ, వారి వైభవాన్ని తల్చుకొని, మరీ మరీ చెప్పుకుని మురిసి పోతుంటాం; ఓట్లేసి గెల్పిస్తాం!

ఈ దేశంలో తప్ప ఇంకెక్కడా జరగదిది.

* * *

సుబ్బరామ రెడ్డి గారి మరణం జిల్లాకు సంబంధించి ... తీరని కొలుకోలేని విషాదం. ఆయన్ను తెలిసిన వారు, ఆయనలో ... కన్న వారు, ఆయన జీవితపు పోకడలు గమనించిన వారు ఆయన మరణం అంత విషాద పరిస్థితులలో, కర్కశుల చేతిలో జరిగిందని నమ్మలేక పోతున్నారు. వ్యక్తిగతంగా నాకు సుబ్బరామ రెడ్డి గారితో పదిహేనేళ్ల పరిచయం. రాజకీయాలలోకి వచ్చిన తర్వాత సాన్నిహిత్యమూ పెరిగింది. ఇటీవలి కాలంలో ఆయన రాజకీయ పోకడలపై మేము చేసిన విమర్శనాత్మక విశ్లేషణలు ఆయన మనసుకు కష్టం కల్గించిన మాట నిజమే కాని, వ్యక్తిగత సంబంధాలలో ఆ వార్తలు, విమర్శలు ఎప్పుడూ కలతలు రేపలేదు. ఎక్కడెదురు పడినా ఆప్యాయంగా పలుకరించే వారు; అభిమానంగా మాట్లాడే వారు; హార్దికమైన ఆతిథ్యం ఇచ్చే వారు. సంభాషణలో అరమరిక లుండేవి కావు; తన సంపద, తన స్థాయి, తన పలుకు బడి, తన అంతస్తు, తన గొప్ప తనం ఏ మాత్రం వ్యక్తం చేసే వారు కాదు. అవతలి వ్యక్తి ఆత్మ గౌరవం దెబ్బ తినకుండా ప్రవర్తించడం ఆయనలోని గొప్ప దనం. అమితమైన మర్యాద చూపేవారు. స్నేహానికి ప్రాణం ఇవ్వడం సుబ్బరామ రెడ్డి గారి విశిష్టత. ఎంత సమయం వెచ్చించి అయినా, ఎంత శ్రమ పడి అయినా, స్నేహితులకు సాయపడే వారు.

రంగనాథ స్వామి దేవాలయం వ్యవహారాలలో సుబ్బరామ రెడ్డి గారి దాతృత్వం నాకు బాగా అర్థమైంది. బంగారు గరుడ వాహనం పునర్నిర్మాణం ఆయన చలువే. తాను ఆరేడు లక్షలివ్వడమే కాక, తన పలుకుబడితో టిటిడి నుంచి కూడా సహాయం అందజేసి దేముడి పట్ల తన భక్తి ప్రపత్తులు ప్రదర్శించారు. ఆ దేవాలయానికి పది లక్షల వరకు విరాళాలిచ్చా డాయన. కాని ఆ ప్రాంగణంలో ఆయన పేరె లేదు; వుండాలని ఎప్పుడూ కోరలేదు. వంద రూపాయల ట్యూబ్ లైట్ ఇచ్చి, ఎర్ర రంగుతో దాని పొడవునా పెద్దక్షరాలతో పేర్లు వ్రాయించు కునే దాతలున్న నెల్లూరులో ఆయన వలె గుప్తంగా వుండ గలిగే వారెందరు?

రంగనాథుడంటే ఆయనకు అమిత గురి. తమ ఉభయం వున్న రోజు ఢిల్లీలో వున్నా, రెక్కలు కట్టుకొని వాలేవారు. ఏ పని చేయాలన్నా ముందు రంగడ్ని అర్చించడం ఆయన కలవాటు. ఆ రంగడు కూడా ఆయన్ను ఆ కిరాతకుల నుంచి రక్షించ లేకపోయాడంటే - దేముళ్లకూ విశ్వాసం వుండదను కోవాలేమో!

సుబ్బరామ రెడ్డి గారు చేసిన దానాలు, విరాళాలు ఇట్లా వూరు, పేరు లేకుండా మాసి పోయాయి. ఆయన పేరును, మంచి తనాన్ని, వుదారతను ఉదాత్తతను వ్యక్త పరిచే ఆనవాళ్లే లేవు.

సుబ్బరామ రెడ్డి గారి పై వారి సోదరు లిరువురికీ ఎక్కడ లేని గురుత్వం. ఆయన రాజకీయ పోకడలు తమకు నచ్చినా, నచ్చక పోయినా, రాజకీయాలలో ఆయన లక్షలు, కోట్లు దుబారా చేస్తున్నా ఎప్పుడూ అభ్యంతర పెట్టి ఎరుగరు. ఆయన సంతోషమే తమ సంతోష మనుకునే వారు! తమ సోదర భక్తిని ప్రదర్శించు కోవడానికి, తమ సోదరుడి మంచి పేరు పది కాలాల పాటు నిలపడానికి ఏదైనా బృహత్ సంస్థను స్థాపించడం బాగుంటుంది. సత్యసాయి బాబా వంటి వారి సహకారంతో నెల్లూరులో ఒక ఉచిత ఆస్పత్రి, కాలేజి వంటి సంస్థలు నెలకొల్పడం మంచిది.

సుబ్బరామరెడ్డి గారు మర్చిపో గల్గిన, మర్చి పోదగిన వ్యక్తి కాదు. ఆయన పేరు జిల్లాలో కలకాలం జనం నోళ్లలో నానుతూనే వుండాలి. ఆ లక్ష్యం నెరవేర్చే ధర్మ సంస్థను స్థాపించడం ఆయన సోదరుల బాధ్యత.

## చేయని హత్యను చేసినట్లు నక్సలైట్లు చెప్తారా?

# రాజకీయ కుట్ర వుందని జనంలో అనుమానాలు!

చేస్తారు? కొందరు అనుమాన పడుతున్నట్లు నక్సలైట్ల పేరుతో ఇతరులు ఫోర్జరీ ప్రకటన లివ్వడం సాధ్యమా? అంతటి దుస్సాహసానికి ఒడిగడితే నక్సలైట్లు విధించే శిక్షలు ఎంత భయంకరంగా వుంటాయో వేరే చెప్పాలా?

అయితే నక్సలైట్లు తాము సుబ్బరామ రెడ్డి గారి కిడ్నాప్‌కు ప్రయత్నించామని, గన్ మ్యాన్ తొందర పాటు వల్ల అది హత్యగా పరిణమించిందని చెప్పారే కాని; ఆ కిడ్నాప్‌కు సరైన కారణం ఇవ్వక పోవడం ఇటువంటి అనుమానాలకు, అస్పష్టతకు దారితీస్తున్నది.

### రాజకీయ హత్య అనడానికి ఆధారం ఏమిటి?

ఇది రాజకీయ హత్య అనే ప్రచారం విస్తృతంగా వుంది. సాధారణ జనమే కాదు - సీనియర్ రాజకీయ వాదులూ ఇది రాజకీయ హత్యేనని ఢంకా భజాయించి చెప్తున్నారు; పత్రికలలో ప్రకటనలు చేస్తున్నారు; సభలలో మాట్లాడు తున్నారు. ఏ ఆధారం లేకుండా, ఏ నమ్మకమైన సమాచారం లేకుండా వారా విధంగా ప్రకటనలు చేస్తున్నారా? అదే నిజమైతే వారి వుద్దేశ్య మేమిటి? దురుద్దేశ్యం కాకుంటే వారి దగ్గరున్న ఆధార మేమిటి? దురదృష్టవశాత్తు ఆ నాయకు లెవ్వరూ తమ అభిప్రాయానికి ఆధారం ఏమిటో, ఏ రూపంలో ఇది రాజకీయ పరంగా జరిగిన దుర్మార్గమో వివరించడం లేదు. అటు పోలీసులు, ఇటు నక్సలైట్లు, మధ్యలో నాయకులు జనాన్ని అయోమయంలో ముంచు తున్నారు.

రాజకీయ వర్గాలు దీన్ని రాజకీయ హత్యగా అనుమా నించడానికి ప్రధాన కారణం - నక్సలైట్లు కిడ్నాప్ చేయ దల్చుకుంటే ఆ పద్ధతిలో, ఆ ప్రదేశంలో చేయరు కదా అన్న అభిప్రాయం. ఒంగోలు చుట్టు ప్రక్కల ఎక్కడా అటవీ ప్రదేశాలు లేవని; 70, 80 కిలో మీటర్ల దూరం ప్రయాణించ వలసిన పరిస్థితులలో సులభంగా దొరికి పోయే ప్రమాదం వుంది కాబట్టి నక్సలైట్లు అంత సాహసం చేయరని; పైగా వారు కిడ్నాప్‌కు వచ్చి వుంటే గన్ మ్యాన్‌ను విస్మరించి ప్రమాదం కొని తెచ్చుకొనే రిస్క్ చేయరని; నక్సలైట్లకు సుబ్బరామ రెడ్డి గారితో శత్రుత్వం కాని, కిడ్నాప్ చేయ వలసినంత బలవత్తర కారణం కాని లేవని; అన్నిటి కంటే ముఖ్యంగా నక్సలైట్ అగ్ర నాయకులెవరూ దీని పై వివరణ ఇవ్వలేకున్నారని; హంతకులలో ఒక్క గణేశ్ మినహా మరెవ్వరూ గుర్తింపు పొందిన నక్సలైట్లు కాక పోవడం గమనించ వలసిన విషయమని, అన్ని కోణాల నుంచి ఆలోచించి చూసినప్పుడు ఇది కేవలం నక్సలైట్ల హత్య అని నిర్ధారించడం పొరపాటని; అంతకు మించిన రాజకీయ కారణం దీని వెనుక వుందని ఆ నాయకులు వాదిస్తున్నారు. ఆ దృష్టితోనే వారు పత్రికా ప్రకటనలు చేస్తున్నారు.

### ప్రత్యక్ష సాక్షులను విచారించలేదేమి?

పోలీసు కొంచెం చురుకుగా వ్యవహరించి, సరైన రీతిలో దర్యాప్తు జరిపి, నిజా నిజాలు బహిర్గతం చేసి వుంటే ఈ అపోహలకు, అపార్థాలకు ఆస్కారం వుండేది కాదు. ఎందువల్లనో వారిలో ఆ చురుకు దనం కన్పించడం లేదు. ఆనాటి దురంతంలో ప్రత్యక్ష సాక్షులైన, కాల్పులలో గాయ పడిన వెన్నారెడ్డి పెంచలు రెడ్డి, తాటిపర్తి సుబ్బారెడ్డిలను కూడా ఇప్పటి వరకు పోలీసులు విచారించ లేదట. వీరిద్దరూ ప్రత్యక్ష సాక్షు లైనప్పుడు జరిగిన సంఘటనను వారి నుంచి తెలుసు కోవడం ప్రథమ కర్తవ్యం కదా? ఎందువల్ల వారా విషయంలో నిర్లక్ష్యంగా ప్రవర్తించారు? పోలీసులు ఈ కేసును నీరు గార్చడానికి ప్రయత్నిస్తున్నారని ఆరోపించ డానికి ఆస్కారం లేదు. హత్య జరిగిన అర పూటలోగా ముఖ్య మంత్రి శ్రీ ఎన్. చంద్రబాబు నాయుడు దీని కోసం అడిషనల్ డిజిపి ర్యాంకులోని హెచ్.జె. దొరను ప్రత్యేక అధికారిగా నియమించారు. సిబిసిఐడిలో ఒక స్పెషల్ గ్రూప్‌ను ఏర్పాటు చేశారు. ఎస్‌పి స్థాయి కల్గిన అధికారిని [illegible] చేశారు. హంతకుల అచూకీ [illegible] శ్రీకాకుళం వెళ్లి అరెస్ట్ చేశారు. ఈ దృష్టితో చూసినప్పుడు పోలీసును నిందించడానికి లేదు. వారు ఎప్పటి కప్పుడు తమ దర్యాప్తు వివరాలను పత్రికలకు వెల్లడించక పోవడం వల్ల వారి పై విమర్శలు వస్తున్నా యనుకోవాలి. అయితే ఇటువంటి కీలకమైన నేర విచారణలో తొందరపడి ఏ పోలీసు అధికారి పత్రికల కెక్కరు. దానివల్ల మేలు కంటె కీడే ఎక్కువగా వుంటుంది. కానీ జనంలో వారు చెప్పే వరకు ఎదురు చూసే సహనం లేదు. నాయకుల ప్రకటనలు పరిస్థితిని మరింత గందర గోళ పరుస్తున్నాయి.

### రాజకీయ హత్యకు ఎవరికి అవసరం వుంది?

ఇది రాజకీయ హత్య అనుకొంటె, అంత అవసరం ఎవరికి వుంది? నెల్లూరుకు సంబంధించి హత్యా రాజకీయాలు ఇప్పటి వరకు జరగలేదు; ఇక ముందు జరగవు. సుబ్బరామ రెడ్డి గారితో అంతటి తీవ్ర విబేధాలు ఎవరికీ లేవు. రాజకీయ మనస్పర్థలను చంపడం, నరకడం వంటి దుశ్చర్యలతో పరిష్కరించాలనుకునే క్రిమినల్స్ జిల్లా రాజకీయాలలో ఎవరూ లేరు. ఒంగోలుకు సంబంధించి సైతం సుబ్బరామ రెడ్డి గారిని భౌతికంగా తొలగింప జేయడం ద్వారా లబ్ది పొంద గల్గిన వారు ఎవరున్నారు? అంతటి కక్షలు, కార్పణ్యాలు ఏర్పడడానికి ఏ సంఘటనలు జరిగాయి? తన పాటికి తను జనంతో కలిసి ఒక ప్రవాహం వలె ముందుకు వెళ్లి పోవడం తప్ప సుబ్బరామ రెడ్డి గారు ఎప్పుడూ ఎవరితోనూ కక్షలు పెరిగే ధోరణిలో వ్యవహరించ లేదు. అది ఆయన తత్వం [illegible] అంతటి శత్రుత్వాలూ లేవు.

### నక్సలైట్లు కిరాయి హత్యలు చేయరు

రాజకీయ వాదుల ప్రమేయంతో డబ్బు కోసమో, మరొక ప్రలోభంతోనో హత్యలు చేసే నీచ స్థితికి నక్సలైట్లు దిగజారు తారని భావించ లేము. తమ అవసరం, తమ నిర్ణయాల ప్రకారం హింసకు పాల్పడడం తప్ప, కిరాయి హంతకులుగా వ్యవహ రించడానికి నక్సలైట్లు అంగీక రిస్తారని చెప్పడం పొరపాటౌతుంది. గణేశ్ ఒకవేళ అటువంటి వ్యక్తిగత నిర్ణయం తీసుకొని వుంటె, నక్సల్ నాయకులు ఈ పాటికి

> **మాగుంట హత్య**
>
> మొదటి పేజీ కొరవ

దాన్ని ప్రకటించి వుండేవారు; అందుకు బాధ్యులైన వారిని తామే శిక్షించి వుండే వారు. తమ ఉద్యమానికే ప్రమాదం వాటిల్లి, పోలీసు నిర్బంధాలు పెరిగి, తమ సంస్థ నిషేధానికి ప్రభుత్వం [illegible] చేసేంత తీవ్రమైన పరిస్థితికి దారి తీసిన ఈ దుర్ఘటనలో తమ తప్పు లేకుంటే [illegible] ఈపాటి కెప్పుడో తేల్చి చెప్పి వుంటె వారు కదా?

### ఈ మంగలి కిట్టప్ప కథ ఏమిటి?

తంబళ్లపల్లి ప్రభాకర రెడ్డి దగ్గర మంగలి పని చేస్తుండిన మంగలి కిట్టయ్య అనే వ్యక్తికి ఈ హత్యతో సంబంధం వుందని ఒక పుకారు. ఇతడి కుమారుడు నక్సలైట్లలో చేరి వున్నాడట. ఈ హత్యకు రూప కల్పన చేసింది అతనేనని చెప్తున్నారు. అయితే అతడికి సుబ్బరామ రెడ్డి గారితో ఏ విబేధాలు వున్నాయి? అవి వ్యక్తిగతమా? లేక నక్సలైట్ల తరపునే పన్నిన పన్నాగమా? ఏదీ నిర్ధారణగా చెప్పలేని పరిస్థితి

### గన్‌మాన్ అసలు కాల్పులు జరపనే లేదు

[illegible] గన్ మ్యాన్ తొందర పాటు వల్ల హంతకులు కాల్పులు జరిపారని, అదే ఈ అనర్థానికి దారి తీసిందని చెప్తుండిన వాదానికి పూర్తి వ్యతిరేకంగా ఒక కొత్త వాదం బయల్దేరింది. దీని ప్రకారం అసలు గన్‌మ్యాన్ కాల్పులే జరప లేదని, అతడి తుపాకి పేల లేదని చెప్తున్నారు. అదే నిజమైతే గణేశ్‌ను ఎవరు కాల్చారు? అతడి తొడలో దిగబడిన బుల్లెట్ ఎవరి తుపాకి నుంచి వచ్చింది? గన్‌మ్యాన్ తొందర పాటు వల్లనే తమ కార్యకర్తలు కాల్పులు జరప వలసి వచ్చిందని నక్సలైట్లు సైతం ప్రకటించారు కదా? నిజాలు నిర్ధారించు కోకుండా వారు ఎందుకు ప్రకటన చేశారు?

ఆ రోజు సుబ్బరామ రెడ్డి గారి వెనుకనే మాజీ ఎమ్మెల్యే మహీధర్ రెడ్డి, స్థానిక మునిసిపల్ ఛైర్మన్ మంత్రి శ్రీనివాసులు, ఒకరిద్దరు యువజన కాంగ్రెస్ నాయకులు వుండినారు. మహీధర్ రెడ్డి సుబ్బరామ రెడ్డి తోటి గదిలో నుంచి బయటకు వచ్చారట. అందువల్ల వారే ఈ [illegible] పై కొంత ప్రత్యక్ష సమాచారం అందించ గలరు. కాని వారెందువల్లో పెదవి విప్పడం లేదు. తమకేమీ తెలియనట్లే ప్రవర్తిస్తున్నారు. వారి మౌనంలోని అంతరార్థమేమిటి? పోలీసు వారి కథనాన్ని ఎందువల్ల రికార్డు చేయలేక పోతున్నది?

శ్రీకాకుళంలో దొరికిన ఇద్దరు హంతకులు నక్సలైట్లేనా? వారే దళంలో పని చేస్తున్నారు? దీని పై [illegible] కథనం ఏమిటి? మొదటి రోజే దొరికిన గణేశ్, డ్రైవర్ ప్రకాశంలు చెప్పిన వాస్తవాలేమిటి? ఈ డ్రైవరు ఎవరు? అతరూ నక్సలైటేనా? కాకుంటే వారితోటి మూడు నాలుగు రోజులు ఎందుకు వుంటాడు? కారు నంబరు ప్లేటు మార్చి తిరగ డానికి ఎందుకు అంగీకరిస్తాడు? అతడికి స్థానికులతో ఎవరితోనైనా వ్యక్తిగత సంబంధా లున్నాయా? అన్నీ ప్రశ్నలే!

### కిడ్నాప్‌కు అంత డొక్కు కారు వాడుతారా?

అన్నిటి కంటె పెద్ద ప్రశ్న - కిడ్నాప్ కోసం రెడీ అయిన వారు అంత డొక్కు కారు ఎందుకు వుపయోగించా రన్నది! రెండు కిలో మీటర్లు కూడా పోక ముందే అది చెడిపోయింది కాబట్టి, పోలీసులు కలమేలు కొనే వ్యవధి లభించింది. లేకుంటె గణేశ్ కూడా పట్టుబడి వుండే వారు కాదు. అతరు దొరక కుండా వుండి వుంటె హత్య పై అనుమానాలు, అపోహలు, అపార్థాలకు, అసలు అదుపనేదే వుండి వుండదు.

### చీరాల వైపెందుకు పరారైనట్లు?

హంతకులు, తమ కిడ్నాప్ యత్నంలో భాగంగా పొదిలి అడవులలో మకాం పెట్టాలని ప్లాన్ చేసినట్లు తొలి దర్యాప్తులో తెలిసింది. అక్కడ అన్ని ఏర్పాట్లు చేసుకున్న వారు చీరాల రోడ్డులో పారి పోవడానికి ఎందుకు ప్రయత్నించారు? త్రోవ గుంట నుంచి కడవ కుదురు వెళ్లే రోడ్డు అధ్వాన్నంగా వుంటుంది. కారు స్పీడుగా తోలడం అసాధ్యం. పైగా మధ్య మధ్యలో చాలా గ్రామాలున్నాయి. వాటి దగ్గర రోడ్డు చాలా ఇరుకుగా వుంటుంది. జనం రద్దీ ఎక్కువ. అంత రిస్క్ కల్గిన మార్గంలో పరారీకి వారు ఎందుకు ప్రయత్నించారు?

ఏది ఏమైనా ఈ దుర్ఘటనలో దర్యాప్తు తీవ్ర తరం చేయ వలసిన అవసరం ఎంతైనా వుంది. అది ఎంత త్వరగా జరిగితే అంత మేలు. పోలీసులు స్పష్టంగా హంతకులు ఎవరో, వారి పథకం ఏమిటో, హత్య లేదా కిడ్నాప్‌కు కారణం ఏమిటో స్పష్టంగా వివరిస్తె తప్ప దీని పై జనంలో ఏర్పడిన సందేహాలు తొలగవు. రాజకీయ హత్య అన్న ప్రచారం ఆగదు.

## లక్ష్మిపార్వతి

మొదటి పేజీ కొరవ

సంతృప్తి పరుస్తున్నా రాయన. ఆయన ఆరోగ్యం విషయంలో ఎప్పుడేమి జరుగు తుందో తెలియదు కాబట్టి, దీప ముండగానే ఇల్లు చక్క బెట్టుకున్నట్లు వ్యవహ రిస్తున్నారు లక్ష్మిపార్వతి గారు. ఆయన అనుమతితో, ఆయన ప్రతినిధిగా రాష్ట్ర మంతా తిరిగొస్తె రేపు వారసత్వ సమస్య, నాయకత్వ సమస్య ఎదురైనప్పుడు జనామోదం పొందడం సులభ మన్నది ఆమె అంతరంగ అభిప్రాయం. అందువల్లే ఆమె సభల నిర్వహణకు అంత త్వరగా సాహసించారు; అంతగా తొందర పడుతున్నారు. అదృష్టం కలిసి రావడంతో హైదరాబాదు, మదన పల్లె సభలు రెండూ గ్రాండ్ సక్సెస్ అయ్యాయి. త్వరలోనే ఆమె నెల్లూరు, విజయ వాడ, వరంగల్ వంటి కీలకమైన నగరాలు సందర్శించ బోతున్నారు.

## సణుగుడు

(4 పేజీ కొరవ)

పోయినట్లు కేకలు పెట్టి, పోలీసు అసమర్థతను శాపనార్థాలు పెట్టే మనం; ఏ ప్రభుత్వ గుమాస్తానో వంద రూపాయల లంచం అడిగితే ఎసిబికి రిపోర్టు చేసి, పట్టించి, శాస్తి జరిగిందని సంతసించే మనం ఒక మంత్రి ఇరవై వేల కోట్లు దండగ చేస్తె రాజీనామా అడిగి వూరకో గల్గుతున్నా మంటె ఆ ఘనత వహించిన భారతీయతకు జోహార్లు అర్పించాల్సిందే!

ఒక దొంగో, బందిపోటో దోపిడీకి పాల్పడితే దానికి సంబంధించిన వ్యక్తి, లేదా కుటుంబానికి నష్టం జరుగు తుంది. అదే అధికారంలో వుండే నేత అవినీతి కక్కుర్తికి పాల్పడితే మొత్తం సమాజం నష్టపోతుంది. అటువంటి అవినీతి పరులను పదవికి రాజీనామా చేయమని ఆందోళన చేసి, వారు ఆ కాగితం సమర్పించగానే క్షమించి వదిలేయడం [illegible]. అధికారంలో వున్న వారి అవినీతి చిట్టాలు వెలుగులోకి వచ్చినప్పుడు వాటి పై కొద్దిగా ఆలస్య మైనప్పటికీ సమగ్ర విచారణ జరిపించి, నిజం నిగ్గు తేల్చి, సాధారణ క్రిమినల్స్ వలెనే వారినీ కటకటాల వెనక్కు నెట్టడం; తిన్న ప్రజా ధనాన్ని అణా పైసలతో సహా తిరిగి కక్కించడం జరగాలె తప్ప, రాజీనామాలతో సరిపెడితే ఎట్లా?

నెల్లూరు నుంచి ఢిల్లీ వరకు రాజకీయాలలో ఇటువంటి సుఖరాంలు ఘాలా మందే వున్నారు. ప్రజల ధనం స్వాహా చేసి చాలా సుఖంగా బ్రతుకు తున్నారు. నిత్యం పత్రికలలో రాజకీయ వాదుల పై అవినీతి ఆరోపణలు ఎన్ని వందలు, వేలు చదువు తున్నాం మనం? ఆ తర్వాత వాటి పై విచారణ జరిగినట్లు, ఒక్కగానొక్క నాయకుడి

కొరవ 6 పేజీలో

## జిల్లా వార్తలు

(5 పేజీ తరువా)

కొనసాగింపు జానపద పాటల పోటీల్లోనూ ప్రథమ బహుమతులు పొందారు. సంస్థ కార్యదర్శి బి. ప్రభాకర్ వందన సమర్పణతో కార్యక్రమం ముగిసింది.

### ఆత్మకూరు కరువు ఎదుర్కోక తప్పదా?

ప్రస్తుతం నెలకొన్న వర్షాభావ పరిస్థితులు ఇదే విధంగా కొనసాగితే ఆత్మకూరు తాలూకా వాసులు కరువును చవి చూడక తప్పేట్లు లేదు. సెప్టెంబరు, అక్టోబరు నెలలో కురిసిన స్వల్ప వర్షాలకు ఈ ప్రాంతంలోని చెరువులు నిండ లేదు. పెన్నా యేటివాలుగా కరెంటును నమ్ముకొని మోటార్ల క్రింద పోసిన నార్లు ఎండి పోతుండడంతో వాటిని కోసి పశువులకు వేయాల్సి వచ్చింది. పలు చెరువుల్లో నీళ్లు లేక పోవడం వల్ల నారు వేయను ఏ రైతుకూ ధైర్యం చాలడం లేదు. ఇక వర్షాలు పడే సీజన్ కూడా లేక పోవడంతో రైతులు దిక్కు తోచని స్థితిలో వున్నారు. గతంలో ఇటువంటి దుస్థితి ఎప్పుడూ ఏర్పడ లేదని పాత తరం రైతులు వాపోతున్నారు. రైతులను ఈ పరిస్థితి నుంచి ఆదుకొను ఎమ్మెల్యే కొమ్మి లక్ష్మయ్య నాయుడు ఎటువంటి ప్రయత్నం చేయక పోవడం పట్ల సర్వత్రా విమర్శలు విన్పిస్తున్నాయి. గత కొన్ని రోజులుగా ఆత్మకూరుకు రావడాన్ని ఎమ్మెల్యే తగ్గించు కొన్నారట. మరి రైతుల గోడు వినే వారెవ్వరు?

### వెంకటగిరి పారిశుద్ధ్య కార్మికుల సమ్మె

వెంకటగిరి పంచాయితీలో పనిచేసే పారిశుద్ధ్య కార్మికులు 11 తేది నుంచి నిరవధిక సమ్మె చేస్తూ విధులకు గైర్హాజ రవుతున్నారు. మూడు నెలలుగా పంచాయితీ జీతాలు చెల్లించక పోవడం వల్ల సమ్మె చేయాల్సి వచ్చిందని కార్మికుల వివరణ. కార్మికులకు నచ్చ చెప్పడంలో కార్య నిర్వహణాధికారి విఫల మయ్యారు. సమ్మె మూలంగా టౌనులో ఎక్కడచూసినా చెత్తాచెదారం పేరుకు పోయి గబ్బు కొడుతూంది. జిల్లా పంచాయితీ అధికారి ఈ విషయాలన్నీ పట్టనట్లుగా వ్యవహరిస్తున్నారు. ఏదో విధంగా కార్మికులకు నచ్చ చెప్పక పోతే సమస్య మరింత జటిల మయ్యే ప్రమాదం వుంది.

### వెంకటగిరిలో టీకాల కార్యక్రమం!

వెంకటగిరి, బాలాయ పల్లి, డక్కిలి మండలాల్లో ఆరోగ్య శాఖాధికారులు పల్స్ పోలియో కార్యక్రమంలో ఉత్సాహ వంతంగా పాల్గొన్నారు. 9 తేది మూడు మండలాల్లో 5, 980 మంది పిల్లలకు పోలియో చుక్కల మందు వేసినట్లు ఆరోగ్య శాఖాధికారులు చెప్పారు.

### బుచ్చి స్కూలు వజ్రోత్సవం

బుచ్చిరెడ్డి పాళెంలోని డి.ఎల్.ఎన్.ఆర్. ఉన్నత పాఠశాల వజ్రోత్సవం డిశంబరు 23, 24 తేదిల్లో ఘనంగా జరిపేందుకు పూర్వ విద్యార్థి సంఘం కృషి చేస్తున్నది. ఈ సందర్భంగా 22 తేది ప్రత్యేకంగా ఏర్పాటు చేస్తున్న సాహిత్య వేదికకు మాజీ ఎమ్మెల్యే బెజవాడ పాపిరెడ్డి అధ్యక్షత వహిస్తారు. ఎమ్మెల్యే జక్కా వెంకయ్య, బెజవాడ ఓబుల రెడ్డి ముఖ్య అతిథులు. ఉత్తర ప్రదేశ్ మాజీ గవర్నర్ డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డిని సన్మానిస్తారు. విజయ వాడ ఆకాశ వాణి స్టేషన్ డైరక్టర్ ఆర్. అనంత పద్మనాభ రావు సాహిత్య విషయాలను అవలోకిస్తారు. సాయంత్రం జరిగే విద్యా సాంస్కృతిక వేదికకు బుచ్చి మండ లాధ్యక్షురాలు శ్రీమతి [illegible] అధ్యక్షత, సర్పంచ్ డాక్టర్ మెహెరాజ్ బాబు ముఖ్య అతిథులు. భోపాల్ దూరదర్శన్ డైరక్టర్ టి.వి.ఆర్. చారి ఉపన్యసిస్తారు. పూర్వ ప్రధానోపాధ్యాయులు, ప్రసిద్ధ ఉపాధ్యాయుల అభిప్రాయ సముచ్చయం, అనంతరం సన్మానాలు కొనసాగుతాయి. 24 తేది సన్మాన వేదికలో కళాశాల పూర్వ విద్యార్థులు ప్రస్తుతం హైదరాబాద్ డిఐజి శ్రీ పి. ఆంజనేయ రెడ్డి, సమాచార శాఖ డైరక్టర్ ఎం. చంద్రశేఖరయ్య, ఎ.ఐ.ఆర్. అనంత పద్మనాభ రావు, జక్కా వెంకయ్య, బిజెపి నాయకుడు వెంకయ్య నాయుడు, శాస్త్ర వేత్తలు డి.వి. రాఘవ రెడ్డి, పి.ఎస్. రెడ్డి, గ్రంధి లక్ష్మయ్య, కాంట్రాక్టర్లు ఒ. కృష్ణమ నాయుడు, డి. వెంకయ్య నాయుడు, దూరదర్శన్ టి.వి.ఆర్. చారి, సబుదు రేబాల రమణను రాష్ట్ర సెకండరీ విద్యా శాఖా మాత్యులు శ్రీ బల్లి దుర్గా ప్రసాద్ చేతుల మీదుగా సన్మానింప చేస్తారు. ఈ రెండు రోజుల పాటు ఏర్పాటైన సాంస్కృతిక కార్యక్రమాల్లో అగ్రా కృష్ణమూర్తి సంగీత విపంచి, రాంజీ నృత్యేంద్ర జాలం, రామలింగా రెడ్డి హాస్య వల్లరి, శ్రీమతి అత్యూఖ్య కూచిపూడి నృత్యం, రేబాల రమణ, బండారు రవి కుమార్ నాటకాలు ఏర్పాటు చేస్తున్నారు.

### కావలిలో శరీర సౌష్టవ పోటీలు

కావలిలోని స్లిమ్ అండ్ ట్రిమ్ హెల్త్ క్లబ్ డిశంబరు 25 తేది వివిధ పోటీలు నిర్వహిస్తున్నది. పురుషుల విభాగంలో బాడీ బిల్డప్ పోటీలు నిర్వహించి మిస్టర్ కావలి టైటిల్‌ను బహూకరిస్తారు. అదే విధంగా వెయిట్ లిఫ్టింగ్ పోటీలు కూడా నిర్వహిస్తారు. జనవరి 1 తేది ఉదయం మహిళల [illegible] ఫ్లవర్ షో, పోషక విలువలు [illegible] స్వీటు, పాటు తయారీ చేయడంలో పోటీ నిర్వహిస్తారు. సాయంత్రం 5 గంటలకు జరిగే బహుమతి ప్రదానోత్సవ కార్యక్రమానికి ప్రముఖ వక్త అన్నదాత మణి అధ్యక్షత వహిస్తారు. కావలి ఆర్డీఓ రఘునందన రావు, మండలా ధ్యక్షురాలు శ్రీమతి మంజుల ముఖ్య అతిథులుగా విచ్చేస్తారు. ఆసక్తి గల యువతీ యువకులు కావలి రామ్మూర్తి పేటలోని హెల్త్ క్లబ్‌లో సంప్రదించ వచ్చుని నిర్వాహకులు శ్రీమతి టి విద్యావతి, కోచర్ జెమ్ జిలాని కోరుతున్నారు.

### వెంకటగిరిలో బంద్

పార్లమెంట్ సభ్యుడు శ్రీ మాగుంట సుబ్బరామ రెడ్డి హత్యకు నిరసనగా 2 తేది యువజన కాంగ్రెస్ ఆధ్వర్యంలో వెంకటగిరి బంద్ జరిగింది. కాంగ్రెస్ నాయకులు ఎలికం శంకర రెడ్డి, పిల్లి పుల్లారెడ్డి, పెట్లూరు రమణా రెడ్డి, వి. కరుణాకర్ ఈ కార్యక్రమానికి నాయకత్వం వహించారు. దుకాణాలన్నీ స్వచ్ఛందంగానే మూసి వేశారు. ఎక్కడి బస్సులు అక్కడే నిలిపి వేయడం వల్ల తిరుపతి నుండి వస్తుండిన ఇతర ప్రాంతాల వారు ఇబ్బందులు పడ్డారు.

### స్వాతంత్రోద్యమ చరిత్ర పై నెల్లూరులో సదస్సు

నెల్లూరు జిల్లా స్వాతంత్రోద్యమ చరిత్ర పై సెమినారను 1996 మార్చి నెలలో నిర్వహించేందుకు సన్నాహక సమావేశాన్ని 6 తేది నిర్వహించారు. నెల్లూరు పురావస్తు శాఖ కార్యాలయంలో జరిగిన ఈ సమావేశంలో వి.ఆర్. కళాశాల చరిత్ర శాఖాధ్యక్షులు డి. రాధాకృష్ణను సెమినారకు డైరక్టర్‌గా ఎన్నుకొన్నారు. సెమినార్ జాయింట్ డైరక్టర్, నెల్లూరు సర్వోదయ కాలేజి చరిత్ర శాఖాధ్యక్షులు జి. వెంకటేశ్వరరావు సంస్థ నిర్వహణ తీరు పై మాట్లాడారు. ఈ సెమినార్‌లో జిల్లాలో జరిగిన స్వాతంత్రోద్యమంలో పాల్గొన్న ప్రముఖుల ఫోటోలు, వెంపా[illegible] తెలియ జేసే ఎగ్జిబిషన్ [illegible]హించాలని, స్వాతంత్ర్య [illegible]సమరయోధులను సన్మానించాలని [illegible]నించారు. జిల్లా పురావస్తు శాఖాధి[illegible] డాక్టర్ బి. జవహర్ లాల్ కూడా ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

### రాపూరు డిపోలో ఇక ఆర్డినరీ సర్వీసులే!

డిశంబరు 1 తేది నుండి నెల్లూరు రాపూరు మధ్య తిరిగే ఫాస్టు ఆర్టీసీ సర్వీసులను, ఆర్డినరీ సర్వీసులుగా మారుస్తూ డిపో మేనేజరు ఎ. సుధాకర్ ఆదేశాలు జారీ చేసారు. రాపూరు నుండి నడిపే సర్వీసుల్లో ఫాస్టు సర్వీసులే అధికంగా వుండడంతో గ్రామస్తులు ఇబ్బంది పడుతున్నట్లు డిపో మేనేజరకు ఇప్పటికైనా తెలిసి రావడం పట్ల ప్రజలు సంతోషిస్తున్నారు. ఫాస్టు బస్సులు ఎక్కే వారు బాధపడ కుండా వుండేందుకు నెల్లూరు - రాపూరు మధ్య ప్రత్యేకంగా ఒక సర్వీసును నడుపు తారట. పుట్టపర్తికి కూడా మరో బస్సు వేస్తున్నట్లు డిపో మేనేజర్ వివరించారు.

### గూడూరులో కరెంట్ కోత సమయం

గూడూరులో ఉదయం 7 గంటల నుండి 9 గంటల వరకు, మధ్యాహ్నం 3 నుంచి 6 గంటల వరకు విద్యుత్ కోత అమలులో వుంటుందని డి.ఇ. కె. సుందర రామిరెడ్డి చెప్పారు. వ్యవసాయ మోటార్లు కల్గిన రూరల్ ఫీడర్లను రెండు విభాగాలు చేసి విద్యుత్ కోత విధిస్తున్నారు. మొదటి విభాగంలో ఉదయం 5 నుంచి 11 వరకు, రాత్రి 11 గంటల నుంచి 2 వరకు, మూడు ఫేసలలో విద్యుత్ సరఫరా చేస్తారట. రెండవ విభాగంలో ఉదయం 11 గంటల నుండి సాయంత్రం 5 గంటల వరకు విద్యుత్ సరఫరా చేస్తామని వివరించా రాయన.

## పంచాంగం

### పండుగ నెల

గురుమౌఢ్యమి జరుగు చున్నది. శుభ కార్యములు చేయరాదు.

### ధనుర్మాసము

16 తేది శనివారం పండుగ నెల ప్రారంభం. ధనుర్మాసము

### డిసెంబరు తిథులు

మార్గశిర బహుళ

తే 16 శని నవమి సా.గ. 5.51 వ
తే 17 ఆది దశమి సా.గ. 5.10 వ
తే 18 సోమ ఏకాదశి సా.గ. 4.06 వ
తే 19 మంగళ ద్వాదశి ప.గ. 2.36 వ
తే 20 బుధ త్రయోదశి ప.గ. 12.48 వ
తే 21 గురు చతుర్దశి ప.గ. 10.30 వ
తే 22 శుక్ర అమావాస్య ఉ.గ. 8.32 వ

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఎ

జమీన్‌రైతు
సంవత్సర చందా రూ. 100/-
అర్ధ సంవత్సరం చందా రూ. 50/-


హలో! నీకూ నాకూ పెళ్ళంటలో నర్తకీమణుల మధ్యలో ఆలీ

# ఇద్దరి మధ్య తగువుకు సినీ పరిశ్రమే స్తంభించాలా?

మరే ఇతర భాషా చిత్రాలలో లేని వివాదం తెలుగు చిత్ర జగతిలోనే తలెత్తడం విడ్డూరం. నిరుడు అక్టోబర్ 3 నుండి డిసెంబర్ 15 వరకు సుమారు 73 రోజుల పాటు సినీ కార్మికులు సమ్మె చెయ్యడం మూలంగా తెలుగు సినిమా రంగానికి 30 కోట్ల దాకా నష్టం సంభవించింది. ఈ నవంబర్ 14న మృగం చిత్రం షూటింగ్ జరుగుతూండగా స్టంట్ మాస్టర్ త్యాగరాజన్‌తో హైదరాబాద్ ఫైటర్లు ఘర్షణకు దిగి కత్తితో పొడిచారని, ఇక మద్రాసు నుంచి హైదరాబాద్‌కు వచ్చే సినీ కార్మికులకు రక్షణ లేదని నిరసిస్తూ దక్షిణ భారత సినీ కార్మికుల సమాఖ్య ఆంధ్ర ప్రదేశ్‌లో జరిగే షూటింగ్‌లలో పాల్గొన కూడదని తన 24 కార్మిక విభాగాలను హెచ్చరించింది. దానితో రాష్ట్రంలో ఎక్కడా షూటింగ్‌లు జరగడం లేదు. పలు షూటింగ్‌లలో పాల్గొనే కార్మికులంతా పని మానుకుని మద్రాసుకు వెళ్లి పోయారు. కేవలం ఇద్దరు కార్మికుల మధ్య చెలరేగిన వివాదాన్ని సామరస్య పూర్వకంగా పరిష్కరించు కోకుండా గోరంతలు కొండంతలు చేసి ఇరవై వేల మంది కార్మికులు గోళ్ల గిల్లుకుంటూ కూర్చో వలసి వచ్చింది. మద్రాసు, హైద్రాబాద్ కార్మికులు ఇలా ఘర్షణ పడుతూంటే ప్రభుత్వం చెవుల దాకా వెళ్లే పరిస్థితి లేదు. ఎన్నో సమస్యలతో ప్రభుత్వమే మిణుకు మిణుకు మంటోంది. పోనీ సినిమా ప్రముఖు లంటారా వాళ్లల్లో వాళ్లు ఇరు వర్గాల వారిని మరీ రెచ్చ గొడుతున్నారు. విడుదలైన సినిమాలు

విజయవంత మవడం అంతంత మాత్రంగానే ఉంది. మరో పక్క టి.వి రంగం నుండి విపరీతమైన పోటీ' తెలుగు సినిమా రంగానికి గడ్డు రోజులు వచ్చినట్లే.

## నీరసమైన కథ, నిస్సారమైన దర్శకత్వం
# ఊరికి మొనగాడు

### చిత్రసమీక్ష
గ్రిద్దలూరు గోపాలరావు

"ఊరికి మొనగాడు" చిత్రంలో మామూలు పద్ధతిలోనే ఒక హీరో, ఒక విలను, ఇద్దరు హీరోయిన్లు వున్నారు. దీన్ని బట్టే తెల్సుకోవచ్చు ఇది ఒక మూస చిత్రమని. హీరో ఆ ఊళ్లోని విలన్ని, అతని అనుచరులను చితక దన్ని ఆ ఊరికి మొనగా డవుతాడు. తాను మొనగాడ్నని పించుకునేందుకు అనుసరించిన తీరులో హీరోలో ఉదాత్తత లేదు. విలన్ పాటించిన కక్ష సాధింపు చర్యల్లో కరుకు దనం కనిపించదు. అందువల్ల చిత్రం యావత్తు చప్ప చాలా చౌక బారుగా తయారైంది. అందుకు కథ కూడా ఒక కారణం.

ఒక ఊళ్లో కోదండ రామయ్య అనే ధనవంతు డుంటాడు. అతడికి బాబ్జీ అనే కొడు కుంటాడు. ఇతను మొదటి భార్య కొడుకు. మొదటి భార్య చనిపోయిన తర్వాత, కోదండ రామయ్య రెండో పెళ్ళి చేసుకుంటాడు. రెండో భార్యకు ఆరు మంది పిల్లలు. తన తండ్రి ఆస్తి మొత్తం తాను దక్కించు కునేందుకుగా బాబ్జీ ఆ ఆరుమంది పిల్లల్ని చంపేస్తాడు. తండ్రిని ఒక గదిలో వేసి బంధిస్తాడు. ఇంటి పెత్తన మంతా తన గుప్పెట్లో ఇరికించు కుంటాడు. ఆ ఊర్లో నియంతగా వ్యవహ రిస్తాడు. అతడ్ని ఎదిరించ గలిగిన హీరో రాంబాబు ఒక్కడే. ఆ ఊరికి కొత్తగా వచ్చిన పంతులమ్మను బాబ్జీ మానభంగం చెయ్య బోతాడు. రాంబాబు అడ్డుకొని బాబ్జీ ముక్కలు విరగ్గొట్టాడు. అప్పటి నుంచి బాబ్జీ సాగించే ఘోరాలను రాంబాబు ఎదుర్కొంటూ వుంటాడు. రాంబాబు పీడ వదిలించు కోవాలని బాబ్జీ ప్రయత్నిస్తుంటాడు.

బాబ్జీ దుర్మార్గ ప్రవర్తన భరించలేని అతని భార్య బాబ్జీ చచ్చినట్టుగా భావించి బొట్టు తుడిచేసి, గాజులు పగలగొట్టేసి విధవ రాలుగా నటిస్తుంది. దానితో తన భార్య అడ్డంకి కూడా తొలగించు కోవాలను కుంటాడు బాబ్జీ.

ఆ ఊర్లో వున్న మామూలు పద్ధతి ప్రకారం శరీరం నిండా గడ్డి చుట్టుకొని ఒక గడ్డి బొమ్మలా రాంబాబు ఊళ్లో తిరుగుతాడు. అదే వేషంలో బాబ్జీ తయారై తన భార్యను చంపి ఆ నేరం రాంబాబు మీదకు నెట్టి జైలుకు పంపుతాడు. రాంబాబు జైలు నుంచి తిరిగొచ్చి బాబ్జీని హత మారుస్తాడు.

రాంబాబును పెళ్లి చేసు కోవాలని, మంగళ సూత్రం చేత బట్టుకొని అతడ్ని వెంటాడు తుంది మరదలు దుర్గ. కాని రాంబాబు తాను ప్రేమించిన సీతను పెళ్లి చేసుకుంటాడు.

కథలో ఎక్కడా పట్టు లేదు బాబ్జీ చేసే హత్యలకు లెక్కే లేదు.

కొరవ 11 పేజీలో

# ఇప్పటి జనానికి మోత కావాలి!

"అలనాటి సంగీత దర్శకులకు, నేటి సంగీత దర్శకులకు తేడా ఏమిటో చెప్తారా?" అని సుప్రసిద్ధ సంగీత దర్శకుడు ఎస్. రాజేశ్వర రావును అడిగితే, "ఆ కాలంలో మేమంతా హార్మోనియం పెట్టెతో ఫోటోలకు ఫోజ్ ఇచ్చేవాళ్ళు. ఇప్పుడొస్తున్న యువతరం సంగీత దర్శకులు కీబోర్డ్ కంప్యూటర్ డిస్క్‌లతో ఫోజులు ఇస్తున్నారు. అంతే తేడా! సంగీతంలో శ్రావ్యత తగ్గి, హోరు పెరిగింది. ఇప్పటి జనానికి ఆ మోత కావాలేమో ఇంతకన్నా ఏం చెప్పమంటారు" అన్నారాయన నవ్వుతూ.

ఎస్. రాజేశ్వర రావు విశ్లేషణ

### "పంజరం"

"స్త్రీ బ్రతుకు పంజరం పంటిదనే నగ్న సత్యాన్ని కొత్త కోణంలో చూపిస్తున్నాం" అన్నారు కోడి రామకృష్ణ. ఆయన దర్శకత్వం వహించే "పంజరం" చిత్రంలో వినోద్ కుమార్, మీనా, చంద్ర మోహన్, మనోరమ, సంగీత, ఆలీ, ముక్కు నరసింహ రావు, ధమ్ నటిస్తున్నారు. సంగీతం: రాజా

# శ్రీరాముడుగా ఎన్టీఆర్ మనుమడి పరిచయం

రవాణా శాఖ మంత్రి నందమూరి హరికృష్ణ పుత్రుడు నందమూరి తారక రామారావు త్వరలో సహజ కవి మల్లెమాల సుందర రామిరెడ్డి భారీ ఎత్తున నిర్మించే బాల రామాయణంలో బాల శ్రీరాముడుగా నటించ బోతున్నాడు. సినిమా రంగానికి ఎన్టిఆర్ మరో వారసుడు అయిన తారక రామారావు తాతను మించిన నటుడు అవుతాడని ఆశిద్దాం.

### రాజనాలకు శస్త్ర చికిత్స

మధు మేహం వ్యాధి వల్ల కొంత కాలం క్రితం రాజనాల కుడి కాలి బొటన వేలును తీసేశారు. ఇటీవల ఆ వ్యాధి మరింత ముదరడంతో హైదరాబాద్‌లో వైద్య నిపుణులు మోకాలు వరకు తీసేయ వలసి వచ్చింది. ముఖ్య మంత్రి చంద్రబాబు నాయుడుకు విజ్ఞప్తి చేయడంతో చికిత్సకయ్యే ఖర్చును రాష్ట్ర ప్రభుత్వమే భరించేలా ఆయన ఆదేశాలిచ్చారు.

### "మా ఆ.. ఆవిడ కలెక్టర్" షూటింగ్

ఆర్టిస్టులు, టెక్నీషియన్‌లకు ఇచ్చిన కాల్‌షీట్లు వినియోగించు కోకపోతే

కొరవ 11 పేజీలో


మాగుంట సుబ్బరామరెడ్డి
జననం: 26.11.47
మరణం: 1.12.1995

సహృదయులు, నిరాడంబర వితరణ శీలి, చిరునగవుల మోముతో సదా పలకరించు, మా ప్రేమ బంధువు అయిన శ్రీ మాగుంట సుబ్బరామ రెడ్డి గారి ఆత్మకు శాంతి కలుగ జేయాలని శ్రీ రంగనాథ పెనుశిలేశులను ప్రార్థిస్తూ నివాళు లర్పిస్తున్నాము.

కె.ఎస్. రామానుజాచార్యులు
ఆగమపండిత, పెంచలకోన క్షేత్రం
కె. జగన్నాథాచార్యులు,
పరిచారి, నెల్లూరు
కొండయ్యస్వామి, జగయ్యపేట

## జనవాణి

(3 పేజీ కొరవ)

దూపాలి. పల్లెల్లో కంటే పట్టణాల్లో 60 శాతం జనాభా మురికి వాడల్లో అపరిశుభ్రమైన పరిసరాల్లో హీనాతి హీనంగా నివసిస్తున్నారు. ఈ నిర్భాగ్యుల పిల్లల పట్ల అందరూ కాసింత శ్రద్ధ చూపిస్తే 2 వేల సంవత్సరం నాటికి పోలి హెకనపడ కుండా పోతుంది.

గూడూరు -పి.వి. ప్రభాకర రావు

### ఈ పద్ధతి బాగోలేదు

ఇక నుండి రాష్ట్రంలోని చౌక డిపో లన్నింటినీ మహిళలకే కేటాయించి, ప్రస్తుతం వున్న డీలర్లలో పురుషులను తొలగించాలని ప్రభుత్వం తల పోయడం మంచి పద్ధతి కాదు. చౌక డిపోల డీలర్ల నియామకాలు జరిపే టప్పుడు స్త్రీలను మాత్రమే నియమించాలన్న ఆలోచన కొంత వరకు సమర్థించ వచ్చు. కానీ వున్న వారిని తీసి వేయడం సమంజసం కాదు. డీలరు షిప్పులు మార్చడం ద్వారా ప్రజా పంపిణీ వ్యవస్థ పటిష్ట మవుతుందని ప్రభుత్వం భావిస్తున్నట్లుంది. ఒకరిని కొట్టి మరొకరికి పెట్టే ధోరణి ఎంత వరకు సమంజసమో ముఖ్య మంత్రి చంద్రబాబు నాయుడు ఆలోచించాలి.

కావలి -వి. వెంకట సుబ్బయ్య

### స్వంత వ్యవహారానికి ప్రజా ధనమా?

ఇటీవల హైకోర్టులో చంద్రబాబు నాయుడు తరపున వాదించిన ఢిల్లీ న్యాయ వాదులకు ప్రభుత్వ ఖజానా నుంచి ఫీజు లివ్వారన్న దుమారం లేచింది. చంద్రబాబు నాయుడు తరపున వ్యాజం వ్యక్తి గతం; ముఖ్య మంత్రి హోదాలో కాదు. స్వంత వ్యవహారానికి ప్రజాధనం వుపయోగించడం ఎంత వరకు న్యాయమో ఒకసారి ఆలోచించాలి. రాష్ట్ర ప్రభుత్వానికి ఇద్దరు అడ్వకేట్ జనరల్స్ వున్నప్పుడు ఢిల్లీ నుండి ప్రత్యేకంగా న్యాయవాదులు రావల్సిన అవసరం ఎందుకొచ్చింది? ఈ ధోరణిలో ఆలోచిస్తే ప్రతిపక్ష నాయకుడిగా ఎన్టీ రామారావు కోర్టు ఫీజులు కూడా రాష్ట్ర ప్రభుత్వమే భరించాలి కదా?

బుచ్చి -కె. శ్రీనివాసులు

### మహోన్నతుడు మాగుంట

మాగుంట సుబ్బరామ రెడ్డి లేని లోటు ఎవరూ పూడ్చలేనిది. భారత దేశంలో ఎంతో మంది కోటీశ్వరులు రాజకీయాల్లోకి వచ్చారు. వారంతా ఆస్తులను మరింత పెంచుకొను రాజకీయాలను ఉపయోగించు కొన్నారు. కాని స్వయంగా కష్టపడి సంపాదించిన డబ్బును ప్రజల కోసం ఖర్చు పెట్టిన అరుదైన రాజకీయ నాయకుడు సుబ్బరామ రెడ్డి. ఆయనేది చేసినా సంచలనమే. సింహపురిలో మూడు సినిమా హాళ్లు ఒకే దగ్గర కట్టించడం, దాన ధర్మాలు చేయడం, ఆయన నామినేషన్ వేసేందుకు ఒంగోలుకు వయనమైన విధానం, తిరుపతిలో షష్ఠిపూర్తి నిర్వహణ, ఇటీవల దేశంలోని వంద మంది పారిశ్రామిక వేత్తలలో ఒకడు కావడం ఆయనకే చెల్లింది. సహజంగా మనిషి ఎదుగు తుంటే తన పరిధి కూడా పెరిగి పోతుంది. కాని ఎంత పెరిగినా గర్వం, అహంభావం దరిచేరని సంస్కార వంతుడు. ఏనాడూ పాపులారిటీ కోసం పాకులాడ లేదు. ఇటువంటి అరుదైన గొప్ప వ్యక్తి మళ్లీ జిల్లాలో జన్మించడం జరుగుతుందా?

చెర్లోపాళెం -వి. నిరంజన్

### రౌడీ మూకలను దరిచేర్చకండి!

మాగుంట సుబ్బరామ రెడ్డి పై వున్న అపరిమిత ప్రజాభి మానం ఆయన అంత్య క్రియల రోజు వెల్లడైంది. స్వచ్ఛందంగా ప్రజలు ఆయన మృత దేహాన్ని సందర్శించను వెల్లువలా వచ్చారు. కాని హత్య జరిగిన రోజు ఒక అల్లరి మూక టౌన్‌లో ఏదో వివాదాలు చేస్తూ ప్రజలను భయ కంపితులను చేసింది. సకాలంలో పోలీసులు జోక్యం చేసుకోవడం వల్ల టౌన్‌లో రచ్చలు రేగకుండా పోయాయి. సుబ్బరామ రెడ్డి వంటి విశిష్ట వ్యక్తిత్వం గల కుటుంబాలనీడన రౌడీ మూకలు అసలు వుండకూడదు. వారి కుటుంబ సభ్యులు

ఇక నుండైనా ఇటువంటి మూకను దరిచేర నీయకూడదని మనవి.

నెల్లూరు -పి. అరుణకుమారి

### నాయకుల సంక్షేమానికి పరిమితం

ఇటీవల రాజకీయ నాయకుల పోకడ, పోలీసుల అవస్థ చూస్తుంటే జాలి వేస్తున్నది. దీనికి కారణం ఏమిటో వెతక వలసిన అవసరం ఆసన్నమైంది. ఇటీవల ప్రతి విషయంలో రాజకీయ నాయకుల జోక్యం ఎక్కువై పోయింది. రాజాజీ ముఖ్య మంత్రిగా ఉన్నప్పుడు రాజకీయ నాయకులను సెక్రటేరియట్ వరండాలో తిరగ వద్దన్నారు. బెజవాడ గోపాల రెడ్డి ముఖ్య మంత్రిగా వున్నప్పుడు పోలీస్ వ్యాన్ తన వెంట రాబోతే వద్దన్నారు. కాని నేడు వీధి లైట్లు, కొళాయి, రేషన్ కార్డు కావాలన్నా నాయకుల సిఫార్సు లేనిది అధికారులు పని చేయడం మానేశారు. పోలీసు లైతే వారి డ్యూటీలు చేయడం మర్చిపోయారు. పంచాయితీ నాయకుడితో మొదలు పెట్టి మంత్రి వరకు వారి పర్యటనలకు సెక్యూరిటీ, ఆడంబరాలకు పరిమితమై పోయారు. ప్రజల అండలతో గెల్చే నాయకులకు సెక్యూరిటీ ఎందుకో అర్థం కావడం లేదు. ప్రజల సంక్షేమానికి ఉపయోగ పడాల్సిన పోలీసు వ్యవస్థ రాజకీయ నాయకుల గొడ్డు చాకిరికి పరిమితం కావడం బాధాకరం.

నెల్లూరు -టి.వి.నారాయణ

## అంత కీర్తి

4 పేజీ కొరవ

వి. హనుమంత రావు మాట్లాడుతూ పార్టీ కోసం జేబు నుంచి పది రూపాయలు ఖర్చు పెట్టే వ్యక్తి కాంగ్రెస్‌కు మళ్లీ దొరకరంటూ; నక్సలైట్ల పై శాపనార్థాలు కురిపించారు. పిసిసి అధ్యక్షుడు కొణిజేటి రోశయ్య మాట్లాడుతూ పార్లమెంటు ఎన్నికలను సుబ్బరామ రెడ్డి సేవా తత్పరతతో నిర్వహించ గలనన్న నమ్మకం ఉండేదని; ఇప్పుడెలా చెయ్యాలని ఆవేదన చెందారు. సినిమా నటుడు కృష్ణంరాజు మాగుంట మంచి గుణాలను వర్ణిస్తూ ఒక గ్రంథం వ్రాయ వచ్చన్నారు. కావలి శాసన సభ్యుడు కలికి యానాది రెడ్డి తన ధోరణిలో మాట్లాడుతూ పలువురు అనుకొన్నట్లు సుబ్బరామ రెడ్డి అమాయకుడు కాదని, ఆత్మ గౌరవం కోసం ప్రాణం లాదే వాడని వివరించారు. సినీ నిర్మాత ఎం.ఎస్. రెడ్డి - పుణ్య చరిత్రులు ఉందరు చాన్నాళ్లు... ప్రజల నాలుక పై మాగుంట ఆయుపు వెయ్యేళ్లు; మంచికి మరణం లేదు. మరణానికి హృదయం లేదని కవితా ధోరణిలో చెప్పారు. మాజీ మంత్రి కనుమూరి బాపిరాజు మాగుంటను కలియుగ కర్ణునిగా అభివర్ణించారు.

సభలో ఎఐసిసి ప్రతినిధి మేజర్ వేద ప్రకాష్, రాష్ట్ర పౌరసరఫరాల శాఖ మంత్రి జి. హనుమంత రావు, మాజీ ముఖ్యమంత్రి నాదెండ్ల భాస్కర రావు, మంత్రి బల్లి దుర్గాప్రసాద్, ఎమ్మెల్యే యలమంచిలి శివాజీ, రాష్ట్ర మహిళా కాంగ్రెస్ అధ్యక్షురాలు నన్నపనేని రాజకుమారి మాజీ స్పీకర్ జి. నారాయణ రావు, కె.ఇ. కృష్ణమూర్తి, గాదె వెంకట రెడ్డి, ఆనం సంజీవ రెడ్డి, డేగా నారసింహా రెడ్డి, సోమిరెడ్డి చంద్రమోహన రెడ్డి, కెవి సుబ్బారెడ్డి, నేదురుమల్లి పద్మనాభ రెడ్డి, వేనాటి మునిరెడ్డి, ఎమ్మెల్యే కాసు కృష్ణారెడ్డి, సివి శేషారెడ్డి, పట్రా ప్రకాశ రావు, జె.కె. రెడ్డి, సి. ప్రవీణ్ కుమార్ రెడ్డి తదితరులు మాట్లాడారు.

హిందూ - ముస్లిం - క్రైస్తవ మతాల పెద్దల ప్రార్థనతో సంతాప సభ ముగిసింది.

## నకిలీ షేర్లు

2 పేజీ కొరవ

775 పబ్లిక్ ఇష్యూల మార్కెట్‌లోకి వచ్చి 6412 కోట్లు వసూలు చేశాయి. ఇప్పుడు ప్రతిపాదనలో వున్న ఇష్యూలు ద్వారా మార్చి నెలాఖరు లోపల మరొక 4వేల కోట్లు వసూలయ్యే అవకాశం వుంది. అంటే ఏడాది మొత్తానికి 10 కోట్ల వరకు దండుతారన్న మాట. అయితే 1994 - 95 సంవత్సరంలో ప్రైమరీ ఇష్యూల ద్వారా 13312 కోట్లు వసులైనాయి. ఈ లెక్క ప్రకారం చూస్తే నిరుటి కంటే ఈ ఏడాది 30 శాతం వరకు మార్కెట్ నిధుల సేకరణ క్షీణించిందన్న మాట.

ఈ నెలలో 120 పబ్లిక్ ఇష్యూలు విడుదల కానున్నాయి.

స్పిక్ పెట్రో కెమికల్స్ (455 కోట్లు) సోమాని సిమెంట్ (90 కోట్లు) సన్‌రైజ్ సెక్యూరిటీస్ (70 కోట్లు) కిటోన్ (54కోట్లు) కేడియా (162 కోట్లు) వంటి పెద్ద ఇష్యూలు త్వరలో మార్కెట్‌లోకి ప్రవేశించ నున్నాయి.

## కొత్త ఇష్యూలు

2 పేజీ కొరవ

### ఎల్ఐసి ధనవర్ష విజయవంతం

ఎల్ఐసి ధనవర్ష పథకం అక్టోబరు 31 తేదితో ముగిసింది. 35 కోట్లకు పథకం విడుదలైతే 65 కోట్ల వరకు వసూలైంది.

ధనవర్ష మొదటి పథకం కాని, ఆ తర్వాత ఎల్ఐసి విడుదల చేసిన ఇతర పథకాలకు కాని డబ్బు కట్టిన వారు లాభపడ్డారు. ఎల్ఐసి మ్యూచ్యువల్ ఫండ్స్ పథకాలన్నిటికీ కనీసం 18 శాతం వడ్డీ గిట్టు బాటైంది. అందువల్లే ఈ కొత్త పథకాన్ని ప్రజలు ఆదరించారు.

### ఇండియన్ బ్యాంక్ రీఫండ్

ఇండ్‌బ్యాంక్ మ్యూచ్యువల్ ఫండుకు చెందిన ఇండ్ రత్న స్కీం సర్టిఫికెట్లు 96 ఫిబ్రవరి లోపల అమ్మి వేసి డబ్బు వెనక్కు తీసు కొనవచ్చునని ప్రకటించారు. తక్షణం పరిశీలించు కోవలసిన పథకం - ఇండ్‌రత్న అందులోనే వుంచ దల్చుకొంటే ఆ డబ్బు విలువకు సరిపడా వారివే ఇతర పథకాల సర్టిఫికెట్లు తీసుకోవచ్చు.

## 50 ఏళ్ళ క్రితం

3 పేజీ కొరవ

గోదావరి కస్తూరి పరిమళంలో రుచినీ గూడా పొందింది - పాటలో కమ్మదనం, నృత్యంలో నాజూకు, నటనలో సందర్భ శుద్ధి "ఇన్స్యూరెన్స్" కన్యలో నవనాగరికత కలిగి వున్నవి.

విరజాజి పువ్వైనా స్థానం, అవకాశాన్ని బట్టే శోభిస్తుంది. అదే చంద్ర శేఖరం విషయం గూడా, అడవిలో పెరిగితే మాత్రం గులాబికి రంగు, తావి, స్వభావాలే గదా!

"స్వచ్ఛంద బలవదు జ్వల వీర్యవంతమై ఉబుకు తుంది మన రమణారెడ్డి హాస్య రసం. అది తెచ్చుకోలుగా పరిమిత మైంది గాదు; స్వభావంగా తక్షణో త్పన్నమైనది. కావున్నే ఎప్పటి కప్పుడు నవ్యంగా రుచి కరంగా వుంటుంది. రమణా రెడ్డి లాంటి రత్నం మన ఊరు కావడం మన అదృష్టం. అతని దౌర్భాగ్యం! సెలాస్ రమణా ఎన్నాళ్లకో యిక యీలాటి విందు.

సుబ్బారావు సేవకుని వేషంలో ఎంతైనా రాణించాడు.

"హాణ రూపక రసంబు దరంబు నిండార దిగ్ద్రావి గుద్రున ద్రేచిన" విద్వాంసు లంతా హ్యామ్‌లెట్ లో జయరాజ్ పాత్రను అభినుతించారు.

యం.ఎస్. నరసింహా రావు గారు యీ నటకులు సినిమా రంగాని కెక్కితే యింకా రాణిస్తారని ఆశించారు గాని, నాటక కళలో ఉన్న ప్రత్యక్షాను భూతి స్వప్నావస్థలో యనుభవించే సినిమా రంగంలో లేదనే మా యభిప్రాయం. ధనార్జన, ఫిలిం బొమ్మలో శాశ్వతత్వం వుంటే వుండవచ్చు.

### స్త్రీల సభ

టౌన్‌హాల్ ఎదుట దత్తాత్రేయ మఠంలో 14 తేది సా. 3 గంటలకు బ్రహ్మాండమైన స్త్రీల సభ. కాశీ నివాసిని శ్రీ పార్వతమ్మ గారు, పొణకా కనకమ్మ గారు, కాళహస్తి చేబ్రోల రామరత్నమ్మ గార్ల ఉపన్యాసాలు, అధ్యాత్మిక ప్రబోధం నిమిత్తం మహిళా మండలి స్థాపన, చరఖా ప్రవేశోత్స వాదులు జరుగును. గృహ లక్ష్ముల పునాదులు పవిత్రమైతే లోకమంతా ఉద్ధరింప బడును.

### గుడ్డల వర్తకుల దగా

ట్రంకురోడ్డు జనరల్ స్టోరులో పట్టుచీర - రు. 85 లకు కొన్నాననీ, బిల్లు యివ్వలేదనీ, యితరత్రా విచారించగా దాని ధర రూ. 45 లని మతింపు పేశారనీ, తర్వాత చీర వాపస్ చేస్తే తీసుకోలేదనీ, బిల్లు అడిగినా యివ్వలేదనీ, ఆర్. బాబూరావు ఫిర్యాదు. టెక్స్‌టైల్ ఆఫీసరు దీని కదేందో తెల్పుదురు గాక?

### ఎలెక్షన్

యర్ర కొడవలి జెండాకు ఏ పూరు తలొగడం లేదు. కమ్యూనిస్టు అభ్యర్థి ఆ రథంలో పూరేగుతున్నా మనుబోలు, కాటిపర్తి మున్నగు గ్రామాలు నిదర్శనం. టవున్‌లో సుందరయ్య బ్రదరు డాక్టరు రామచంద్రా రెడ్డి ప్రభృతులొచ్చి ప్రచారం సాగిస్తున్నారు. మ్యానిఫెస్టోలో వివరం చెప్పకుండా డాక్టరు రాజగోపాలా చారి వద్ద సంతకం చేయించాడట రామచంద్రా రెడ్డి. తర్వాత తెలుసుకొని డాక్టరు రాజగోపాలా చారి గారు నాకు సంబంధం లేదని వేరే ప్రకటన పంపారు.

ఓటర్లకు, ప్రజలకు మా హెచ్చరిక: కమ్యూనిస్టు కుతంత్రాలకు మోసపోవద్దు. ఒక్క కాంగ్రెసే దేశంలో ప్రజల తరపున స్వాతంత్ర్య సంపాదనకు కాంగ్రెసు పోరాడు తున్న సంస్థ. అభ్యర్థికి తప్ప మరెవ్వరికి వాగ్దానం చేయవద్దు.

-విమర్శకుడు

## పో.. పో.. పోలియో

జయంపుకృష్ణ

గులాబి లాంటి మోము
నిగనిగలాడే నల్లని కురులు
చెంపకు చేరడేసి కళ్ళు
తేనెలూరే ఎర్రని అధరాలు
అందాల రాసి ఆ అమ్మాయి
కానీ. కుంటు కుంటూ పడుతోంది
పడుతూ నడుస్తోంది
మధ్యమధ్య ఏడుస్తోంది
వెక్కుతూ కాళ్ళు ఈడుస్తోంది
ఈ స్థితికి కారణం ఎవరు?
పోలియో ఆ పాపకు శాపం
ఏ పాపం చేసిందని ఆ రూపం?
చిన్నవాడు పోలియో చుక్కలు
వేయిస్తే చూడక్కర్లేదు దిక్కులు
పెట్ట పళ్ళేదు దేవుడికి మొక్కులు
మూఢాచారాల ముసుగు తీయండి
శాస్త్రీయ ఆలోచనల ద్వారం విప్పండి
పోలియో నిరోధక మార్గం చూడండి
బిడ్డలు అవిటి వారు కాకుండా చేయండి
తీసుకో గలిగితే ముందే నివారణ
బతుకంతా పూర్తిగా మీ బిడ్డకు రక్షణ
పో.. పో.. పోలియో
వెళ్ళిపో.. పోలియో!

## నెల్లూరు సంగతులు

(4 పేజీ తరువాయి)

ముత్యాలు' నవయుత కిరణశ్రీని ఘనంగా సన్మానించారు. విద్యార్థి నాయకులు వెంకయ్య, కార్తీక పాల్, నాగ రాజా, మన్సూర్ ఈ కార్యక్రమాన్ని ఘనంగా జరిపించారు. ప్రధానో పాధ్యాయుడు క్రిష్టఫర్ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా విచ్చేశారు. ఆంధ్ర రాష్ట్ర సాధనకై ప్రాణ త్యాగం చేసిన అమరజీవి పొట్టి శ్రీరాములు, ఆంధ్ర విశ్వవిద్యాలయ స్థాపనకు విశేషంగా కృషి చేసిన సర్ సి.ఆర్. రెడ్డి, ఆంధ్ర సాహిత్య అకాడమీ అభివృద్ధికి కర్తలైన వేటూరి(?)పల్లి రామానుజ రావు, డాక్టర్ కెఎల్ రావు జీవితాలను కిరణశ్రీ విద్యార్థులకు పరిచయం చేసిన విధానాన్ని పావిలాల సోమయాజులు, సర్వేశ్వర రావు చక్కగా వివరించారు.

### మమతాను రాగాలు మూర్తీభవించినమహావ్యక్తి!

మూర్తీభవించిన మహా మనిషి ఒంగోలు ఎమ్పీ మాగుంట సుబ్బరామ రెడ్డి హత్య పాశవికమని 11 తేది సాయంత్రం జరిపిన అత్యవసర మునిసిపల్ సమావేశంలో కౌన్సిల్ ఏకగ్రీవంగా తీర్మానించింది. స్వర్గీయ సుబ్బరామి రెడ్డి పేరు నెల్లూరు టౌన్‌లో కలకాలం గుర్తుండేలా పోలీసు ఆఫీసు మొదలు మాజీ ఎమ్మెల్యే జె.కె. రెడ్డి ఇంటి మీదుగా బైపాసు రోడ్డులో కలిసే రోడ్డును ఇక నుండి సుబ్బరామ రెడ్డి రోడ్డు అని పిలిచేలా తీర్మానించారు. కె.వి. సుబ్బారెడ్డి పెట్రోల్ బంకు కూడలిలో మాగుంట అభిమానులు శిలా విగ్రహ ప్రతిష్ఠ చేయదలిస్తే అందుకు కావల్సిన స్థలాన్నిమునిసి పాలిటీ సమకూర్చేందుకు ముందుకు వచ్చింది. ప్రత్యేక సమావేశానికి మునిసిపల్ ఛైర్మన్ ఆనం వివేకానంద రెడ్డి అధ్యక్షత వహించి ఉద్వేగ భరితంగా మాట్లాడారు. నూతన పారిశ్రామిక విధానాన్ని చేపట్టి జిల్లాలో పది మందికి పట్టెడన్నం పెట్టిన వ్యక్తి అంచనా వేయలేనటువంటి దానగుణం కర్ణుడి తర్వాత సుబ్బరామ రెడ్డి ఒక్కరికే అబ్బిందేమో నన్నారు. తాను అనుకొన్న కార్యక్రమానికి ఎన్ని ఒడిదుడుకులు ఎదురైనా అధిగమించే వ్యక్తిత్వం సుబ్బరామ రెడ్డి గారిలో వుంది. ఆయన మరికొంత కాలం జీవించి వుంటే దేశ స్థాయికి సరిపడే రాజకీయ నాయకత్వాన్ని మాగుంట అందించే వారని ముగించా రాయన. వైస్ ఛైర్మన్ దశరథ రామయ్య మాట్లాడుతూ మాగుంట సుబ్బరామ రెడ్డి చేతికి ఎముక లేని దాతని, భూతద్దం వేసి వెతికినా అటువంటి వారు ఎక్కడా కనపడ రన్నారు. సిపిఎం పక్ష నాయకుడు మాదాల వెంకటేశ్వర్లు రాజకీయాల్లో హత్యా రాజకీయాలు తగవంటూ, మాగుంటను విశిష్ట వ్యక్తిగా పోల్చారు. స్వతంత్ర సభ్యుడు నందాని బాషా మాట్లాడుతూ 1993 లో టౌన్‌లో తీవ్ర మంచినీటి సమస్యను మునిసి పాలిటీ ఎదుర్కొం టున్నప్పుడు అప్పటి మార్కెటింగ్ మంత్రి, అప్పటి ఛైర్మన్ రమేష్ రెడ్డి నాయకత్వంలో మునిసిపల్ సభ్యులు సుబ్బరామ రెడ్డిని కలుసుకొన్న విషయాన్ని గుర్తుకు తెచ్చుకొన్నారు. అడిగిన వెంటనే టౌన్‌కు రెండు ట్యాంకర్లు ఇచ్చిన మహామనిషిగా కీర్తించారు. నెల్లూరులో సూపర్ స్పెషాలిటీ ఆసుపత్రి కట్టాలన్న కోరిక తీరకుండానే మరణించడం బాధాకర మన్నారాయన. కాంగ్రెస్ సభ్యురాలు రాళ్లపల్లి సుబ్బలక్ష్మి మాట్లాడుతూ బీదా బిక్కికి మాగుంట వలె అండగా వుండే మరో వ్యక్తి దొరక రన్నారు. 24 వార్డు సభ్యుడు కె.వి. రాఘవ రెడ్డి మాట్లాడుతూ సుబ్బరామ రెడ్డి ముందు చేయి చాచి ఖాళీ చేతితో తిరిగి వచ్చిన వారు లేరన్నారు. విజయ కుమార్ నాయుడు మాట్లాడుతూ నెల్లూరులో మాగుంట సుబ్బరామ రెడ్డిలా ప్రజాభి మానం పొందిన వారు మరొకరు లేరన్నారు. ఇండి పెండెంట్ సుబ్బారావు మాట్లాడుతూ ఇఫ్కో ఫ్యాక్టరీని పెళ్లకూరు మరణం తర్వాత నెల్లూరు తప్పక తెస్తానని చెప్పిన సుబ్బరామ రెడ్డి లేరన్న విషయం జీర్ణించు కోలేక పోతున్నట్లు చెప్పారు. కౌన్సిలర్లు లక్ష్మి కుమారి, కప్పిర శ్రీనివాసులు, నరసింహ రావు, పున్నం బసవయ్య, కనకయ్య, ఉషారాణి, దేవరాజులు, నవమణి, రంగయ్య, మధు సూదన రెడ్డి, మునాఫ్, రమమ్మ తదితరులు మాట్లాడారు. సంతాప తీర్మానాల తర్వాత వేరే అంశాలు అజెండాలో వున్నా కొందరు కౌన్సిలర్ల కోరిక పైన మిగతా అంశాలు చర్చించ కుండానే వాయిదా వేశారు.



### దర్గామిట్ట ఆంధ్రాబ్యాంకు ఆదివారమూ పనిచేస్తుంది!

ఆదివారం వారపు సెలవు దినం కావడంతో వినియోగ దారులు కొన్ని సమస్యలు ఎదుర్కొంటున్న విషయం తెలిసిందే. ఆ పూట ఏ బ్యాంకునైనా పని చేయించాలని ఖాతాదారులు అడిగి, అడిగి నోరు నొప్పి పుట్టడమే గాని స్పందించిన బ్యాంకు అధికారులు లేరు. లేటుగా అయినా ఆంధ్రా బ్యాంకు అధికారులకు మంచి బుద్ధి పుట్టినట్లుంది. టౌన్‌లో ఆంధ్రా బ్యాంక్ దర్గామిట్ట శాఖ 17 తేది నుంచి ఆదివారపు బ్యాంకింగ్ ప్రారంభిస్తుంది. ఉదయం 9 గంటల నుండి 11 వరకు, సాయంత్రం 5 నుండి 7 వరకు ఆ బ్యాంకు పనిచేస్తుంది.

### ఎమ్మెల్యేలకు బుద్ధి బలం తగ్గి భుజబలం పెరిగింది

బిజెపి అఖిల భారత కార్యదర్శి ఎం. వెంకయ్య నాయుడు గొప్ప వక్తని ప్రత్యేకించి చెప్పక్కర లేదు. వాన్ స్థాయిగా స్థానిక, రాష్ట్ర, జాతీయ, అంతర్జాతీయ విషయాలపై అనర్గళంగా మాట్లాడేస్తారు. బిజెపి విద్యార్థి విభాగం ఎబివిపి 9 తేది టౌన్ హాల్‌లో ఎబివిపి నిర్వహించిన పూర్వ కార్యకర్తల సమావేశంలో పాల్గొని ఆశు కవిత్వ ధోరణిలో మాట్లాడారు. క్రమశిక్షణా రాహిత్యం జాతీయ జీవనంలో ప్రవేశించడం వల్ల అన్ని రంగాల్లో క్షీణ దశ ప్రారంభమైందని, దేశంలో స్వార్థం పెరిగి సామాజిక స్పృహ తగ్గి పోతున్నదని చెప్పా రాయన. శాసన సభల్లో ప్రజా ప్రతినిధులకు బుద్ధి బలం తగ్గిందని, మైకులు విరగ్గొట్టే విషయంలో మాత్రం భుజ బలం ప్రదర్శిస్తున్నట్లు చెప్పి పొడిచారు. సామాజిక స్పృహ చైతన్యం లేని వ్యక్తి జీవితం నిరర్థకమని వ్యాఖ్యానిస్తూ, సమాజంలో నేడున్న రాజీ పడే మనస్తత్వాన్ని ప్రమాద కరమైనదిగా అభివర్ణించారు. నెల్లూరు రాజకీయాల్లో ముఠా, గ్రూపు రాజకీయాలు ఎక్కువ య్యాయని, అవి పోవాలని నాయుడు అభిలషించారు. సమావేశంలో ఎబివిపి పూర్వ విద్యార్థులు ప్రొఫెసర్ ఎన్‌వి శేషగిరి రావు, పి. చంద్రశేఖర్, ఎ. శంకర నారాయణ తదితరులు పాల్గొన్నారు

### వినియోగదారులు చైతన్యవంతులు కావాలి

నెల్లూరు టౌన్‌లో వినియోగ దార్ల హక్కుల పరిరక్షణ కొరకు ఏర్పాటైన విజయ భారతి సేవా సంస్థను 8 తేది ఆర్.ఆర్. వీధిలో జిల్లా జడ్జి ఎల్. అప్పారావు ప్రారంభించారు. ఈ సందర్భంగా మాట్లాడుతూ వినియోగ దార్లు చైతన్య వంతులై తమ హక్కుల కొరకు ముందుకు వచ్చి నాణ్యమైన సరకులను న్యాయమైన ధరలకు లభించే ఉద్యమాన్ని చేపట్టాలని కోరారు. ఆచార్య పిసి రెడ్డి మాట్లాడుతూ 1986 లో పార్లమెంటు ఆమోదించిన వినియోగ దార్ల చట్టం లోపభూయిష్టంగా వున్నదని, అది సశాస్త్రీయమైన సమగ్రమైన శాసనం కాక పోవడంతో వినియోగదార్లు రక్షణ పొందలేక పోతున్నారని, ప్రస్తుత పరిస్థితిని పాలకులు గమనించి సవరణ చట్టం తేవాలన్నారు. డాక్టర్ కె. రాజమ్మ, ఎన్. జానకీ దేవి, ఈ సంస్థ అధ్యక్షుడు జి. మురళీ ధర్ ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

### నెల్లూరులో హెల్త్ బేబీ షో

పొగతోటలోని శ్రీధర్ చిన్న పిల్లల ఆసుపత్రి ఈ యేడాది కూడా హెల్త్ బేబీ షో కార్యక్రమాన్ని నిర్వహిస్తుంది. జిల్లా స్థాయిలో జరిగే ఈ పోటీలో 1 సంవత్సరం లోపు పాపాయిలకు హెల్త్ బేబీ - 95, 3 సంవత్సరాల లోపు బాలికలకు లిటిల్ మిస్ - 95, సంవత్సరం నుండి, మూడు సంవత్సరాల లోపు బాలురలకు లిటిల్ మాస్టర్ - 95 గా టైటిల్స్ అన్నూ పోటీ నిర్వహిస్తారు. ఇందిరా భవన్‌లో 17 తేది సాయంత్రం ఈ పోటీ జరుగు తుంది. ముఖ్య అతిథిగా నెల్లూరు జడ్జి కుమారి టి.కె. శ్రీదేవి విచ్చేస్తారు. ఆసక్తి గల తల్లి దండ్రులు తమ పాపాయిల ఫోటోలతో డిసెంబరు 16 తేది లోగా ఆసుపత్రిలో రిజిష్ట్రేషన్ చేసుకోవచ్చు.

## చిత్రసమీక్ష

9 పేజీ తరువాయి

రాంబాబు మరదలు దుర్గ, చేతిలో తాళి బొట్టు పట్టుకొని, రాంబాబును కలిసి నప్పుడంతా "నా మెళ్ళో తాళికట్టు" అంటూ వేధించడం అసహ్యంగా వుంది. కోదండ రామయ్య రెండో భార్య ఆరుగురి పిల్లల్ని బాబ్జీ చంపినా ఆ విషయమే కోదండ రామయ్య పట్టించు కోకుండా ఆనందంగా హార్మోనియం వాయించు కుంటూ, పద్యాలు పాడు కోవడం చాలా ఎబ్బెట్టుగా వుంది. శరీర మంతా గడ్డి చుట్టుకొని రాంబాబు గడ్డి బొమ్మలా తిరగటం తలతిక్క వ్యవహారంగా వుంది. ఇలా సన్నివేశాలన్నీ చప్పగా రూపొందాయి.

ఏ పాత్రా సరిగ్గా ఎదగలేదు. హీరో పాత్ర మరీ నీరసంగా వుంది. ఎ.వి.ఎస్. శ్రీలక్ష్మి హాస్యం అపహాస్యంగా తయారైంది. ఇవన్నీ ఇంత చౌకబారుగా దిగ జారడానికి కారణం ఉప్పలపాటి నారాయణ రావు దర్శకత్వంలోని బలహీనత. నీరసమైన కథ, నిస్సారమైన దర్శకత్వం చిత్రాన్ని అతుకుల బొంతగా చేసింది.

రాంబాబు పాత్రలో శ్రీకాంత్ బాబ్జీ పాత్రలో కొత్త నటుడు, కోదండ రామయ్య పాత్రలో మరో కొత్త నటుడు, దుర్గ పాత్రలో సంఘవి, సీత పాత్రలో గిరిమ వారి శక్తి మేర లోపం లేకుండా నటించారు. పాత్రల్లో పటుత్వ ముంటే ఇంకా గొప్పగా నటించ గలిగి వుండే వారు. దర్శకత్వం ఈ నటీనటులనూ దెబ్బతీసింది.

పాటల చిత్రీకరణలో వి.ఎస్. రావు తన కెమెరా పనితనం బాగా చూపాడు. జనకపల్లి మోహన రావు మాటలు కొన్ని సన్నివేశాల్లో బాగున్నాయి.

## సినిమా

9 పేజీ తరువాయి

మళ్ళీ వాళ్ళ డేట్లు దొరకడం కష్టం. అంచేత పలు సంస్థలు మద్రాసులోనే షూటింగులు జరుపు కుంటున్నాయి. కోడి రామకృష్ణ దర్శకత్వం వహించే "మా ఆవిడ కలెక్టర్" షూటింగ్ మద్రాసు ఫిలిం సిటీలో ఈ మధ్యన జరిగింది. "ఝుండా ఊంచా రహే హమారా" అనే పాటను జగపతి బాబు, లక్ష్మి, కాస్ట్యూమ్స్ కృష్ణ, దాదాపు ఐయిదారు వందల జూనియర్ ఆర్టిస్టులతో చిత్రీకరించారు. మన త్రివర్ణ పతాక విలువలను తెలిపే పాట ఇది అన్నారు కోడి రామకృష్ణ. ఈయన దర్శకత్వం వహిస్తున్న పై చిత్రంలో ఇంకా ప్రేమ, శుభశ్రీ, ముక్కు, అనంత్, విశ్వేశ్వర రావు, విక్రమ్, సిల్క్‌స్మిత, వై. విజయ, పూజిత, బేబీ జ్యోతి పాత్రధారులు. సంగీతం: వందే మాతరం శ్రీనివాస్.

### ఉగ్రనేత్రుడు

"ప్రగతి" హిందీ చిత్రానికి అనువాదం. అర్థబలంఅంగ బలం, రాజకీయ బలంతో విర్రవీగే ఒక దుర్మార్గుడు. ఎందరో కన్నె పిల్లలను తల్లులు చేస్తూ, ఇంకెందరో ఇల్లాళ్ళను వెలయాళ్లుగా చేస్తుంటే వారి దౌష్ట్యానికి అనకట్ట వేసి, ఆ అబలలకు విముక్తి కలిగించే నాయకుడుగా సల్మాన్ ఖాన్ నటించారు. దర్శకత్వం: కె.కె. సింగ్.

### "పెళ్లాల రాజ్యం" షూటింగ్ మద్రాసులో

"ఓ ఉమ్మడి కుటుంబంలో జయసుధ, జయప్రద, రవలి తోడికోడళ్లు. గొడవలు తలెత్తడం మూలంగా ఎవరి భర్తలతో వారు ఆ ఇంటి నుంచి వేరయి పోవడానికి రమ్యకృష్ణ సాయం తీసుకుంటారు. కాని, రమ్య కృష్ణ ఆ ముగ్గురి భర్తలతో కాస్త చేరువగా ఉండడంతో ఆమె మీదే ముగ్గురు కోడళ్లు యుద్ధం ప్రకటిస్తారు" అని చెప్పారు హరి. ఈయన దర్శకత్వం వహించే "పెళ్లాల రాజ్యం" చిత్రంలో ఒక ప్రత్యేక పాత్రలో కృష్ణ కనిపిస్తారు. చంద్ర మోహన్, సురేష్, ఆనంద్, సత్య నారాయణ, వై. విజయ ఇతర పాత్రధారులు. సంగీతం: కోటి.

## సానుభూతి



తాను వట వృక్షంలా వ్యాపించి తన చల్లటి నీడలో ఎన్నో వేల
కుటుంబాలకు నీడ కల్పించిన మానవతా మూర్తి,
ప్రజా శ్రేయస్సు కోసం అహరహం శ్రమించిన సహృదయుడు

### శ్రీ మాగుంట సుబ్బరామరెడ్డి గారు

మనకిక లేరంటే నమ్మలేకున్నాం. వారి పవిత్రాత్మకు శాంతి
కల్గించమని భగవంతుని ప్రార్థిస్తూ, వారి కుటుంబానికి మా
ప్రగాఢ సానుభూతి తెలియ జేస్తున్నాం.



జి. రమణారెడ్డి - కుప్పచ్చి రామకృష్ణయ్య
కె.సి. కృష్ణమూర్తి

**కామాక్షి స్టీల్స్ - నెల్లూరు**

## ప్రథమ వర్ధంతి



డి. అనిల్‌కుమార్
జననం: 6.3.1969 మరణం: 18.12.1994

### డి. అనిల్‌కుమార్

నీవు మాకు దూరమై పరమాత్మకు చేరువై
అప్పుడే సంవత్సరం గడిచింది.
నీ ఆత్మకు శాంతి చేకూరాలని కోరుతూ
నీ మధుర స్మృతులను మరువలేని

డి. బాబురెడ్డి - తండ్రి
డి. సౌజన్యమ్మ - తల్లి
డి. రాధిక - భార్య
డి. పూజిత్ - కుమారుడు
కె. శ్రీనివాసులు రెడ్డి - బావ
కె. అనిత - చెల్లెలు
కె. విశాల్ - అల్లుడు

... Zaminryot Press, Offset Printing at Nayagara Paper Products (I) Ltd. Nellore